శ్రీ

# శివానందలహరి



"శాంతిశ్రీ"
జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి

ప్రశాంతి నిలయం
పుట్టపర్తి

ప్రథమ ముద్రణము   ప్రతులు వెయ్యి
విభవ వసంతము 1988
వెల రు. 30

This book is Published with the Financial assistance of
Tirumala Tirupati Devasthanams
Under their scheme aid to Publish Religious books

ప్రతులకు :
"శాంతిశ్రీ" జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి
ప్రశాంతినిలయము అనంతపురము జిల్లా

శ్రీ విశ్వేశ్వరా పబ్లికేషన్స్
గవర్నర్ పేట విజయవాడ - 2

ముద్రణ :
రాఘవేంద్ర
విజయవాడ-11



హే దయాంబుధీ! సర్వ లోకైకనాథ!
కోటి మన్మథ సౌందర్య కోమలాంగ!
భక్తవత్సల సప్తపర్వత నివాస!
భవ్య పద్మావతీ మనః పద్మ భృంగ!

పరమ పావన వేంకటేశ్వరుడ వీవు
పతిత జీవన వేంకటేశ్వరుడ నేను
కొండ కొమ్మపై నీవు కూర్చుండినావు
నేను భవ బంధ పటలి బంధింపబడితి!

పూలలో వాసనలు చూచి ప్రోగుచేసి
మధుర సుందర మందారమాల గూర్చి
కంఠమునవేసి నిను జూచు కాంక్షతోడ
క్షణము క్షణము నీకయి ప్రతీక్షణము సేతు!

# సు ధా ల హ రి

"కరుణశ్రీ"

కస్తూరీ తిలకం కపోలఫలకే, మౌళౌ జటా మండలం,
జిహ్వాగ్రే సకలాః కళాః, కరతలే భూతిం, కరే కల్పకం,
సర్వాంగే ష్వరుణాంశుకంచ, కలయన్ కంఠే సుధావాహినీం,
పుణ్యశ్రీ పరివేష్టితో విజయతే శ్రీ సత్యసాయీ ప్రభుః !

చారుతరమ్ము "సత్యము" ప్రచారమటే! పరమార్థ "ధర్మ" మా
చారమటే! నితాంతమగు "శాంతి" స్వభావమటే! ప్రసన్న గం
భీర శుచి స్మితంబయిన "ప్రేమ" స్వరూపమటే! "అహింసయే"
హారమటే "ప్రశాంతినిలయ"మ్మది స్వామికి ఆలయమ్మటే!

చల్లనివాడు; నవ్వు వెదజల్లెడివాడు; కృపారసమ్ము రా
జిల్లెడివాడు; కాంతులెగజిమ్ము జటామకుటమ్మువాడు; మా
పల్లెకు వచ్చి—మా హృదయ పద్మములన్నియు దోచి తెచ్చినా
డల్లన; పుట్టపర్తి పురమా! పరమాత్ముని జాడ తెల్పవే!

అవతరణాలు శాంతికి, జయంతికి జాగరణాలు; సత్యమున్
శివమును సుందరమ్మయిన సృష్టి కలంకరణాలు ; సర్వమా
నవుల కరిష్ట కష్ట హరణాలు; తమస్సు లడంచు లోక బాం
ధవ కిరణాలు; సాయి చరణాలు సదా శరణాలు మాకగున్!

ఇది శివానందలహరి—సాయీశ్వర ప్ర
సాదితమ్ము—శాంతిశ్రీ అనూదితమ్ము—
ఆదిశంకర భక్తి రసార్ద్ర భావ
భరిత సుమనో మనోజ్ఞమై వరలుగాత!

# ఆ నం ద ల హ రి

వింజమూరి శేషఫణిశర్మ M.A.

శ్రీ వాణ్యుమా సమన్విత
దైవతముఖ్యాది మూలతత్వము పుటప
ర్త్యావాసమయ్యె; ఆ సా
యీవిభు సేవింపఁగంటి రెంత సుకృతులో!

సంధ్యాకాల నటన్మహానట జటాస్రంసజ్ఝరీ తుల్య, మో
హాంధ్యోన్మూలిని, శంకరార్య కృత శైవానంద వాగ్వైఖరిన్
గ్రాంథ్యాంధ్రోక్తుల సీసపద్యముల నిర్మాణించి యర్పించితో
జంధ్యాలాన్వయ వేంకటేశ్వర కవీశా! సత్యసాయీశ్వరున్!

మీ పద్యావళిలో శిరీష సుమముల్ మిన్నేటి రాయంచలున్
గ్రేపుల్ పావలు వెన్నెలల్ మధువులున్ శ్రీపారిజాతమ్ములున్
మా పంచేంద్రియ సంచయమ్మునకు సంహ్లాదంబు సంధించి హృ
త్తాపంబున్ హరియించెడున్ స్మృతములై తత్తద్గుణశ్రేణులన్!

అనువాదంబులు దర్పణంపుఁ బ్రతిబింబాకారముల్ దాల్ప నే
ర్పునఁ దీర్పం జతనంబొనర్తు రితరుల్, క్రొంగ్రొత్త యందంబు లొ
ల్క నలంకారము లింపు నింపు నుడి తళ్కుల్ గూర్చుకొన్నట్టి మీ
యనువాదంబున బింబసుందరి వినూత్నాహార్యయై పొల్చెడున్!

పుటపర్తీశ్వర పాదపద్మ సుమనః పుంజంబులై మోద సం
ఘటన ప్రీణిత భక్తకోటి సుమనః కంజంబులై తావకో
త్కట భక్తిస్ఫుట తుష్ట సర్వసుమనః కమ్రంబులై యొప్పు నీ
నిటలాక్ష స్తుతి పద్యముల్ వెలయు "శాంతిశ్రీ" యశోదంబులై—

# అమృతలహరి

మాననీయ సోదరులు శ్రీ జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రిగారు రచించిన శివానందలహరి తెలుగు పద్యములను వ్యాఖ్యానమును చదివి ఆనందామృత లహరిలో నోలలాడితిని. ఇందు ప్రతి పద్యము తెలుగులో నిండుతనము సంత రించుకొని మృదు మధురమయిన శైలీ సౌందర్యముతో సులభముగా అర్థమగు చున్నది. శివానందలహరిలో నోలలాడు భాగ్యము ఆంధ్ర పాఠకలోకానికందినది.

శ్రీ శాస్త్రిగారు పండిత వంశమున జన్మించిరి. వీరి పూర్వులు శివపూజా పరాయణులు. వీరి తండ్రిగారు శివరాత్రి వ్రతోపవాస దీక్షాపరులు. వీరి బాబాయి గారు మహాకవులు శ్రీ కరుణశ్రీ గారు.

శ్రీ శాంతిశ్రీ గారు సహజ సిద్ధమయిన కవితాధారను సంస్కృతాంధ్ర హిందీ ప్రముఖ భాషా సాహిత్య పరిశ్రమచే పరిపుష్ట మొనర్చుకొని జ్యోతిర్మయి, త్యాగమయి, ఉదాహరణత్రయి, సుందర మందారము, తియ్యని పాటల తిరుప్పావై, అర్చన, నారద భక్తి దర్శనములవంటి ఉత్తమ రచనల నొనర్చిరి. వీరి రసవత్కవితా ప్రవాహము భక్తి మార్గమును బట్టి తెలుగు మాగాణమున ప్రవహింప సాగినది.

శ్రీ శాంతిశ్రీ గారు తన భావనాశక్తితో పాఠక భక్తుల జ్ఞానతృష్ణకు నాడీపరీక్ష నొనర్చి మధుర కవితా రసాయనమున భక్తిని రంగరించి తగు మోతాదులో నందించిన భవరోగ వైద్య నిపుణులు. వీరు అలతి అలతి పదములతో చిన్న చిన్న గీతికలుగా పద్యగేయ ఫణితిని కావ్యరచన సాగించుటయే గాక సరళ సుందరమయిన గద్యశైలిలోను నైపుణ్యము ప్రదర్శించిరి. వీరి నారద భక్తి దర్శనము పలువురు పండిత ప్రశంసలందిన ప్రసిద్ధ వ్యాఖ్యాన గ్రంథము.

ఈ శివానందలహరి ఒక విశిష్ట రచన. ఇందు ఆదిశంకరుల అద్భుత మేధా సంపత్తి అడుగడుగునా అత్యంతాశ్చర్యానందములు కలుగజేయును.

ఆది శంకరుల దృష్టిలో మనస్సు ఒక మంధర పర్వతము, ఒక ఆకాశము, ఒక రాజహంసము, ఒక ఉద్యానవనము, ఒక మణిపాదుక, ఒక అశ్వము, ఒక తటాకము, ఒక గృహము, ఒక గజము, ఒక నవవధువు....ఏమి కల్పనలు! ఇందు సహజ శబ్దాలంకారసహిత శయ్యా శైలీ సౌకుమార్యానికి తోడు శ్లేష, ఉపమా, రూప కోత్ప్రేక్షాద్యలంకారములతో గూడిన అనల్ప కల్పనా పటిమ వర్ణింప నలవికానిది. ఇట్టి అందములన్నియు తెలుగున సంవిధాన పరచి శాంతిశ్రీ తెలుగు పాఠ్య లోకమునకు మహోపకార మొనరించినారు

శాంతిశ్రీ గారు తనకు పూర్వపుణ్య వశమున ప్రాప్తమయిన కవితాధారలో తెలుగున రసవంతమయిన రచన సాగించి సంస్కృతభాషాభిజ్ఞులకు కూడ లాభ ప్రాప్తి గావించిరి. సీసాలతో కవితా సారమెక్కించిన శ్రీనాథుని పోలిన కవితా రసామృతాన్ని తమ సీసాలలో మన కందించిరి. సంస్కృతాంధ్ర ముల నశ్రాంత పరిశ్రమ గావించి వీరు తమ కవితాధారను భక్తి రస ప్రవంతికి ఏతమెత్తి తెలుగు మాగాణిని ప్రవహింపజేసి భక్త హృదయ క్షేత్రాలలో సత్ఫలాలను పండించినారు.

ఇందు ప్రతి పద్యము ప్రత్యేకమయిన నడకతో శ్లోక భావమును సరళ సుందరముగా నందించుచు సరస సంబోధనలతో సాగి సందర్భమునకు సరిపడిన సౌందర్యము చేకూర్చుచున్నది. ఈ అనుభూతి శ్లోక పద్యములు చదువనేర్చిన వారికి లభించును. అతి సామాన్య ఆంధ్ర పాఠకలోకమునకు హృదయానందము నందించుటకు సరళ సుందర వ్యాఖ్య కూడ శాంతిశ్రీ రచించి పాఠకులకు ఆనంద మును ద్విగుణము త్రిగుణము గావించుకొను అవకాశము కలిగించిరి.

ఈ విశిష్ట రచన ఆంధ్ర సరస్వతి కమూల్యాలంకారమై ఇతోధికై తాదృశ రచనలకు ప్రోద్బలకమై శ్రీ శాంతిశ్రీకి శాంతి శ్రీలు నందించుగాక యని భగవాన్ శ్రీ సత్యసాయీశ్వరుని ప్రార్థించుచున్నాను.


ప్రయాగ సూర్యనారాయణ మూర్తి
ఆంధ్రోపన్యాసకులు

శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయము
ప్రశాంతి నిలయము.

# శంకర భగవత్పాదులు

శ్రీ శంకరాచార్యుల వారి మేధస్సు జ్ఞానమయం, మనస్సు ప్రేమ మయం, శిరస్సు తేజోమయం, వచస్సు కవితామయం! ఆ మహానుభావుడు అఖండ మేధా నిధులలో అద్వితీయుడు, భక్తి రసార్ద్ర హృదయులలో మహనీయుడు, మంత్ర తంత్ర మహిమాన్వితులలో గణనీయుడు, వరణీయుడు.

శంకరులు ఎనిమిదవ శతాబ్దంలో కేరళలోని ఉత్తర తిరువాన్కూరులో కాలడి గ్రామంలో శివగురువు ఆర్యాంబా దంపతులకు జన్మించారు. వీరిది నంబూద్రి బ్రాహ్మణ వంశం. వీరు ఐదవ సంవత్సరంలోనే ఉపవీతులై కొద్ది కాలంలోనే సకల వేదశాస్త్రాల్ని, బ్రహ్మవిద్యని కరతలామలకం చేసుకొన్నారు. బ్రహ్మచర్యంలోనే తురీయం స్వీకరించి శ్రీ గోవింద భగవత్పాదుల శిష్యులైనారు.

శంకరులు అద్వైత ధర్మ ప్రచారం కోసం అఖండ జైత్రయాత్ర జరిపి సర్వ ధర్మ విజయం సాధించారు. ధర్మోద్ధరణకై దేశం నలు మూలలందు అద్వైత ధర్మ పీఠాల్ని నెలకొల్పారు.

శంకరాచార్యుల ప్రబోధాలు సమస్త మానవజాతికి శిరోధార్యాలు-విశ్వ కళ్యాణ కారకాలు - శివానందకరాలు - జాతికి వరాలు! వీరు పందొమ్మిది భాష్య గ్రంథాలు రచించారు. వీటిల్లో దశోపనిషద్భాష్యం బ్రహ్మసూత్ర భాష్యం, భగవద్గీత భాష్యం పరమ ప్రామాణికాలు. వీరు నలబది వేదాంత ప్రకరణ గ్రంథాల్ని వెలయించినారు. వీటిల్లో ఉపదేశ సాహస్రి శిరోభూషణం. వీరు స్తోత్ర ప్రబోధ గ్రంథాలనేకం రచించారు. అందులో సౌందర్యలహరి, శివానందలహరి పేరెన్నికగన్నవి.

సౌందర్యలహరిలో శ్రీ దేవి చక్ర తత్వ వర్ణన ఉంది. యంత్ర మంత్ర తంత్ర నిక్షేపాలున్నాయి. శివానందలహరిలో మహాదేవుని సంస్తవం కావ్య వస్తువు. ఇది చాల విశిష్టమైన గ్రంథం, రసవత్తరమైన కావ్యం. చక్కని ఉపమానాలతో,

చమత్కారాలతో ఇందులోని ఉపదేశాలు సర్వులకు హృదయంగమంగా ఉంటాయి. ఇవి పఠితల మనస్సులపై చక్కని ప్రభావాన్ని కలుగజేస్తాయి. అద్భుతమైన ఆనందాన్ని అందిస్తాయి.

ఈ శివానందలహరి సగుణ నిర్గుణోపాసకులగు భక్తులు జ్ఞానులు మాత్రమే కాక, కవిత్వము పాండిత్యము పొందగోరే సాహితీవ్రతులు కూడ అవశ్యం పఠించదగిన గ్రంథరాజం.

ఇందులో వేద వేదాంత ఉపనిషత్తుల సారం, భక్తిరస పరిప్లావిత లలిత హృదయం అందించబడింది. ఇది మహిమాన్వితమైన నిత్య పారాయణ గ్రంథంగా శంకరుల వారిచే కూర్పబడింది.

పరమ పావనమైన ఈ పుణ్యభూమి జన్మనిచ్చిన మహామేధావులలో శంకరాచార్యస్వామి అగ్రేసరులు. ఆయన తాత్త్వికుడు, భాష్యకారుడు, కవి, పండితుడు, సంస్కర్త, దేశభక్తుడు. ముప్పది రెండు సంవత్సరాలు జీవించినప్పటికీ శంకర భగవత్పాదులవారు ఆచంద్రతారార్కం నిలిచే రచనలు చేశారు. మానవ మాత్రులకు అతీతమైన ప్రజ్ఞాపాటవాలను వారు తమ జీవితకాలంలో చూపించారు.

శంకరాచార్యుల వారి కవిత కాళిదాస కవిత వలె కడుంగడు మనోహరం. కమనీయ కల్పనా శోభితం. ఇదిగో శంకరుల కవితా గంగాఝరి-వారి హృదయ సంవిదానందలహరి-శివానందలహరి !

# అనుక్రమణిక


| శ్లోక సంఖ్య | | | పుట |
|---|---|---|---|
| 61 | అంకోలం నిజబీజ.... | చేదుకోసాయి | 146 |
| 95 | అతి మృదులో | ఆహ్వానం | 2[illegible]4 |
| 68 | అమిత ముదమృతం.... | భక్తి ధేనువు | 160 |
| [illegible]0 | అరహసి రహసి.... | భక్తి ప్రియుడు | 164 |
| 87 | అశనం గరళం.... | బూది యిమ్మా! | 198 |
| 13 | అసారే సంసారే.... | దీనరక్షకుడు | 50 |
| 53 | ఆకాశేన శిఖీ.... | శంకర మయూరం | 130 |
| 46 | ఆకర్ణేనఖరాజి.... | మానసరాజహంస | 116 |
| 55 | ఆద్యామితతేజసే.... | నిత్యసత్యసాయీశ్వరుడు | 134 |
| 91 | ఆద్యావిద్యాహృద్గతా.... | శరణాగతి | 206 |
| 49 | ఆనందామృత.... | పూల పందిరి | 122 |
| 62 | ఆనందాశ్రుభిరాతనోతి.... | భక్తిజనని | 148 |
| 37 | ఆమ్నాయాంబుధి.... | మనస్సు సాగరమధనం | 98 |
| 71 | ఆరూఢ భక్తిగుణ.... | ధనుస్సు | 166 |
| 74 | ఆశాపాశక్లేశ.... | శివశ్రీ పదాలు | 172 |
| 99 | ఇదంతే యుక్తంవా.... | సాక్షాత్కారం | 222 |
| 15 | ఉపేక్షా నోచేత్ కిం ... | బ్రహ్మ గీతతుడు | 54 |
| 58 | ఏకో వారిజ బాంధవః.... | ప్రభారాశి | 140 |
| 80 | ఏష్యతేష జనిం.... | గిరిసంచారం | 184 |
| 81 | కంచిత్కాలం.... | దైనిక జీవనం | 186 |
| 24 | కదావా కైలాసే.... | శివవైభవం | 72 |
| 26 | కదా వా త్వాం దృష్ట్వా.... | ఇంద్రియసిద్ధి | 76 |
| 44 | కరలగ్న మృగః.... | మహాదేవసింహ ! | 112 |
| 27 | కరస్థే హేమాద్రౌ.... | కానుక | 78 |
| 23 | కరోమి త్వత్పూజాం.... | జీవన్ముక్తి | 70 |

| | | | |
|---|---|---|---|
| 1 | కలాభ్యాం చూడాలంకృత.. | శివశక్తే నమస్తుభ్యం | 26 |
| 75 | కల్యాణినం.... | మనోహయం | 174 |
| 52 | కారుణ్యామృత.... | శివాంబుదం | 128 |
| 34 | కిం బ్రూ మస్తవ.... | వీరమణి | 92 |
| 66 | క్రీడార్థం సృజసి.... | క్రీడావనం | 156 |
| 9 | గభీరే కాసారే.... | ఆత్మపుష్పాలు | 42 |
| 2 | గళంతీ శంభో.... | గాథా ప్రవాహం | 28 |
| 42 | గాంభీర్యం పరిఖా.... | మనోదుర్గం | 108 |
| 12 | గుహాయాం గేహేవా.... | వివిధ యోగాలు | 48 |
| 6 | ఘటోవా మృత్పిండో.... | శుష్కతర్కాలు | 36 |
| 45 | ఛందశ్శాఖి శిఖాన్వితైః | మనః కల్పకం | 114 |
| 69 | జడతా పశుతా.... | మూర్ఖులతో కాని చూట్లాడవు | 162 |
| 83 | జనన మృతి యుతానాం... | అమృతుడవు | 190 |
| 85 | జలధి మథన దక్షో.... | బీదపూజ | 194 |
| 32 | జ్వాలోగ్రః.... | శ్రీ కంఠ! | 88 |
| 3 | త్రయీ వేద్యం హృద్యం.. | మహాదేవుడు | 30 |
| 29 | త్వత్పాదాంబుజ.... | దర్శనం | 82 |
| 18 | త్వమేకో లోకానాం.... | లోకైకదాత | 60 |
| 9 | దురాశా భూయిష్ఠే.... | నీ భక్తుడను | 62 |
| )2 | దూరీకృతాని.... | ఆనందదాయి | 208 |
| 39 | ధర్మో మే చతురంఘ్రి.... | శివరాజమౌళి | 102 |
| 40 | ధీయంత్రేణ వచో.... | ఏతాము | 104 |
| 21 | ధృతిస్తంభాధారాం.... | మానస వటకుటీరం | 66 |
| 96 | ధైర్యాంకుశేన.... | మనోమాతంగం | 216 |
| 72 | ధ్యానాంజనేన.... | భక్తినిధి | 168 |
| 89 | నతిభిర్నుతిభిః.... | ఏ పూజ ఇష్టం | 202 |

| | | | |
|---|---|---|---|
| 10 | నరత్వం దేవత్వం.... | పరమానందలహరి | 44 |
| 31 | నాలం వా పర.... | పరమోపకారి | 86 |
| 33 | నాలం వా సకృదేవ.... | భక్తసులభ | 90 |
| 79 | నిత్యం యోగి మనః.... | పదసౌకుమార్యం | 182 |
| 57 | నిత్యం స్వోదర.... | కృపాళువు | 138 |
| 48 | నిత్యానంద రసాలయం... | మానస సరోవరం | 129 |
| 56 | నిత్యాయ త్రిగుణాత్మనే... | శివ స్వరూపం | 136 |
| 41 | పాపోత్పాత విమోచనాయ . | ఇంద్రియాలు | 106 |
| 86 | పూజాద్రవ్య సమృద్ధయో.. | ఎట్లు పూజింతు | 196 |
| 97 | ప్రచరత్యభితః.... | పిచ్చెత్తిన ఏనుగు | 218 |
| 14 | ప్రభుస్త్వం దీనానాం.... | అనాథనాథ | 52 |
| 22 | ప్రలోభాద్యైః.... | మనస్తస్కరుడు | 68 |
| 38 | ప్రాక్పుణ్యాచల.... | చంద్రుడు చంద్రమౌళి | 100 |
| 17 | ఫలాద్వా పుణ్యానాం.... | నా అదృష్టం | 58 |
| 67 | బహువిధ పరితోష.... | స్మరణానందం | 158 |
| 82 | బాణత్వం వృషభత్వం.... | విష్ణు సేవలు | 188 |
| 77 | బుద్ధి స్థ్సిరా భవితుమ్.... | బుద్ధిపుత్రిక | 178 |
| 76 | భక్తిర్మహేశ.... | భక్తి మేఘం | 176 |
| 36 | భక్తో భక్తిగుణావృతే.... | పుణ్యాహవాచనం | 96 |
| 73 | భూదారతాం.... | శరణం తవ చరణం | 170 |
| 51 | భృంగిచ్ఛానటన.... | శ్రీ శైలవాసీ! | 126 |
| 7 | మనస్తే పాదాబ్జే.... | నా ఇంద్రియాలు | 38 |
| 43 | మాగచ్ఛస్త్వమిత.... | మనము వనము | 110 |
| 63 | మార్గావర్తిత.... | కన్నప్ప | 150 |
| 8 | యథా బుద్ధిః శుక్తౌ.... | మోహజాలము | 40 |
| 88 | యదా కృతాంభోనిధి.... | యోగ్యతలు లేవు | 200 |

| | | | |
|---|---|---|---|
| 35 | యోగక్షేమ ధురంధరస్య.. | ఆత్మబంధు | 94 |
| 60 | రోధస్తోయహృతః.... | ఆశాజీవి | 144 |
| 64 | వక్షస్తాడన మంతకస్య. . | పాదుకలు | 152 |
| 65 | వక్షస్తాడన శంకయా.... | నామకవచం | 154 |
| 90 | వచసా చరితం.... | ఋణవిముక్తి | 204 |
| 11 | వటుర్వాగేహేవా.... | ఆశ్రమాలు | 46 |
| 30 | వస్త్రోద్ధూత.... | ఏమి అర్పింతు | 84 |
| 16 | విరించి ర్దీర్ఘాయుః.... | విధి | 56 |
| 47 | శంభు ధ్యాన వసంత.... | మానసోద్యానం | 118 |
| 84 | శివ తవ పరిచర్యా.... | ఇల్లరికం | 192 |
| 54 | సంధ్యాఘర్మదినా.... | సంధ్యాతాండవం | 132 |
| 50 | సంధ్యారంభ.... | మల్లికార్జున స్వామి | 124 |
| 20 | సదా మోహాటవ్యాం.... | మానసమర్కటం | 64 |
| 78 | సదుపచారవిధి.... | సుపుత్రి | 180 |
| 98 | సర్వాలంకార ... | ఇయం మమసుతా | 220 |
| 4 | సహస్రం వర్తంతే... | ఏకైక ఫలప్రదాత | 32 |
| 94 | సారసనా.... | సార్థక్యం | 212 |
| 28 | సారూప్యం. .. | ముక్తిదాత | 80 |
| 93 | సోమకళాధర... | శివరూపం | 210 |
| 25 | స్తవైర్బ్రహ్మాదీనాం .. | శివవిభూతి | 74 |
| 100 | స్తోత్రేణాలం... | అందుకో! శుభచరిత్ర! | 224 |
| 5 | స్మృతౌ శాస్త్రే.... | పశువు | 34 |
| 59 | హంసః పద్మవనం... | కోరిక | 142 |

# నివేదనం

శ్రీ కైవల్య పదంబు జేరుటకుగాను శ్రీశంకరాచార్యదేవుల శివానందలహరీ వీచికలలో విహరించాను, ఆనంద తన్మయత్వంతో స్వేచ్ఛానుకృతి చేశాను.

'స్వాంతస్సుఖాయ', అని శ్రీవారి భావ కవితా బీజాలను ఆధారంగా చేసి కొని చాపల్యం కొద్దీ తెలుగులో శంకర సంస్తుతి చేశాను. అంతేకాని ఇందులో ఇతరులకు తెలియనిది ఏమి తెలియచెప్పలేదు.

శ్రీ శివానందలహరిని ఎందరో మహానుభావులు ఎన్నో విధాలుగా వివరణాత్మకంగా కమనీయ కవితా కల్పనలతో వెలయించారు.

నేను ఇందులోని మూలశ్లోకానికి తెలుగు పద్యం వ్రాసి విషయ సౌలభ్యం కోసం వ్యావహారికంలో పద్య, శ్లోక భావం వచ్చేలాగ వ్యాఖ్య వెలయించాను. ఈ కారణంగా శంకరస్వామిని మరీ మరీ స్మరించే అవకాశం కలిగింది. విషయావగాహనకై ప్రతిశ్లోకానికి ఒక శీర్షిక కూర్పబడింది.

మానాన్నగారు శ్రీ జంధ్యాల రామయ్యగారు ప్రతిమాస శివరాత్ర్యుపవాస ఉపాసనా దృఢవ్రతులు, నిత్య శివపూజా ధురంధరులు, పార్వతీ పరమేశ్వర పాద పద్మారాధనా కళాశీలురు. వారి పుణ్యవిశేషమే నాకీ బలం ప్రసాదించింది. భక్తిని, శక్తిని అనుగ్రహించింది.

ప్రతిరోజు ఉదయ సంధ్యలో సాయంసంధ్యలో కనుల ఎదుట కనిపించే దైవం శివశక్తిస్వరూపులైన భగవాన్ సత్యసాయి పాదపద్మములపై ఈ కృతిని సమర్పిస్తున్నాను.

విశ్వపతి శ్రీనివాస సాయీశ్వరుండు
సత్యశివ సుందరుండు శ్రీ చక్రవర్తి
సకల దేవతాతీతుడు సత్యసాయి
అరుణ చరణాబ్జముల కిది అంకితమ్ము

ఈకృతి ఈ ఆకృతి పొందటానికి అతులితైశ్వర్యుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి సహాయం మరువలేనిది. తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి గారికి, సప్తగిరి సంపాదకులు, సహృదయులు శ్రీ కాట్రపాటి సుబ్బారావుగారికి నా కృతజ్ఞతాభివందనములు.

కమనీయ కవితా సుధాలహరిని నాకు ప్రసాదించిన మా "కరుణశ్రీ" బాబాయి గారికి నా ప్రణామములు. ఆనందలహరిని అందించిన ఎస్.ఆర్.ఆర్. సి.వి.ఆర్. ప్రభుత్వ కళాశాల ఆంధ్రోపన్యాసకులు శ్రీ వింజమూరి శేషఫణి శర్మ గారికి, అమృతలహరిని అనుగ్రహించిన శ్రీసత్యసాయి కళాశాల ఆంధ్రోపన్యాసకులు శ్రీ ప్రయాగ సూర్యనారాయణమూర్తిగారికి నా అభివందనములు. నా రచనలు వ్రాతప్రతులను తీర్చిదిద్దటంలో సహకరిస్తున్న శ్రీ సత్యసాయి కళాశాల ఆంధ్రోపన్యాసకులు చిరంజీవి నిడదవోలు గంగాధర్ గారికి నా శుభాకాంక్షలు.

ఈకృతిని శుభాకృతిగా ముద్రించి యిచ్చిన రాఘవేంద్ర ప్రింటింగ్ వర్క్సు అధినేతలు శ్రీ మాధవశర్మ శ్రీ జవహర్ గారలకు నాశుభాకాంక్షలు.

ఆప్యాయంగా, అనురాగ భరితంగా నన్ను లాలించి, పాలించి, నిరంతరము ఆనందముతో ఆశీర్వాద బిందువులను ప్రసాదిస్తున్న స్వామికి అనేక కృతజ్ఞతా పారిజాతాలు సమర్పింకొంటున్నాను.

-2-88 ప్రభవ
షష్టిపూర్తి

—శాంతిశ్రీ



ఈ శివానందలహరి

శివశక్తి స్వరూపులైన భగవాన్ శ్రీ సత్యసాయి

సుందర సుకుమార దివ్య పాదారవిందములపై

సమర్పితము

## 1. శివశక్తే నమస్తుభ్యం!

శ్లోకం

కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటిత ఫలాభ్యాం భవతుమే,
శివాభ్యాం అస్తోక త్రిభువన శివాభ్యాం హృదిపున
ర్భవాభ్యాం ఆనంద స్ఫురదనుభవాభ్యాం నతిరియమ్

పద్యం

శ్రీకళాకలిత విశేషస్వరూపులు
సిగలపై శశికళల్ చిందువారు
ఒకరి తపఃఫల మొకరైన దంపతుల్
వాగర్థములవోలె వరలువారు
భక్తికి ఫలములు ప్రకటించు అధిపతుల్
ప్రాణిహృత్ పద్మాల వరలువారు
మధురసృష్టికి సర్వ మాంగల్యదేవతల్
త్రిజగత్ శివమ్మొనరించువారు
ఆత్మవిజ్ఞాన సుజ్యోతులైనవారు
అనుభవానంద వరదాతలైనవారు
అఖిల జగతికి తలిదండ్రులైన పార్వ
తీ మహేశ్వరాంఘ్రులకు ప్రణామ శతము

## వ్యాఖ్య

శ్రీ శంకర భగవత్పాదులు గ్రంథారంభంలో శివాశివులైన పార్వతీ పరమేశ్వరులకు నమస్కారం చేస్తున్నారు—

శివ పార్వతులు సర్వకళా స్థానీయులు. శ్రీచక్ర విరాజితులు వేదసాహితీ మూర్తులు. చంద్రుని కళలు శిరస్సులపై అలంకరించుకొన్నారు. భార్య తపస్సు చేసి భర్తను, భర్త తపస్సుచేసి భార్యను పరస్పరం ఒకరినొకరు తపఃఫలాలుగా అందుకొన్నారు. శబ్దార్థములవలె కలిసియున్నారు. భక్తుల భక్తికి తగిన ఫలాలు అనుగ్రహిస్తున్నారు. సర్వప్రాణికోటి ఆత్మపీఠాలపై శివంకరులై ప్రకాశిస్తున్నారు. వారు సర్వసృష్టికి మంగళస్వరూపులు, ఆత్మవిద్యకు జ్యోతులు. అధ్యాత్మ భక్తులకు అనుభవానందము ప్రసాదించేవారు. అఖిలజగతికి జననీజనకులైన ఉమా మహేశ్వరులకు నమస్సుమనస్సులు.

స+ఉమ=సోమ, స+అంబ=సాంబ, స+అయి=సాయి. ఇవి శివాశివుల అర్ధనారీశ్వర సార్థకనామాలు- పార్వతి ప్రకృతి, పరమేశ్వరుడు పురుషుడు- వీరు ఆదిమధ్యాంతరహితులు, శాశ్వతులు.

ఇందు బాలేందుశేఖరుల కళాన్యాస విన్యాసం సమయాచార సూచితార్థాలు యోగశాస్త్ర రహస్యార్థాలు నిక్షిప్తాలు. ఇందు అనుప్రాస సౌభాగ్యం కవితాకల్పనా సౌందర్యం మధురమహనీయంగా భాసించింది. ఇంత పరమ రమణీయమైన శ్లోకం మరొకటి కనిపించదు. 'శివాభ్యాం' అని శివపంచాక్షరీ గానంతో ఈ జయ మంగళ శ్లోకాన్నికూడ స్మరించినట్లు అయింది-

యశ్శివో నామ రూపాభ్యాం
యాదేవీ సర్వమంగళా
తయోస్సంస్మరణాత్ పుంసాం
సర్వతో జయమంగళమ్

## 2. గాథా ప్రవాహం

గళంతీ శంభో త్వచ్చరిత సరితః కిల్బిషరజో
దళంతీ ధీకుల్యాసరణిషు పతంతీ విజయతామ్
దిశంతీ సంసారభ్రమణ పరితాపోపశమనం
వసంతీ మచ్చేతో హ్రదభువి శివానందలహరీ

పద్యం

శంభో! జగదధీశ! అంభోధర సుకేశ!
భవదీయ గాథాప్రవాహమ్మిదికి
భక్తార్తిహర! మహాపాపౌఘ సంహార!
అఘరజోరాశిని అణచివైచి
ఐశ్వర్యరసధుర్య! విశ్వాత్మ సౌందర్య!
బుద్ధికుల్యలజేరి పొంగి పారి
బృందారకానంద! వందారు మందార!
సంసార తాపమ్ము చల్లబరచి

భక్తవరదాత! ఆశ్రితపారిజాత!
నా హృదయ మహాహ్రదములోనన్ వసించి
శ్రీ శివానందలహరి సుశ్రేయశిఖరి
ప్రీతి సతతమ్ము నన్నుద్ధరించు గాక!

## వ్యాఖ్య

శంభో! మహాదేవా! జగత్పతీ! మేఘాలు జడలుగాగల శివా! భక్తుల ఆర్తి హరించేవాడా! పాపహరా! మహైశ్వర్యధుర్యా! విశ్వాత్మ సౌందర్యమూర్తీ! దేవ ప్రియా! భక్తజన కల్పకమా!

నీ చరితం అమృతప్రవాహం. పరమపావనం శివానందలహరి. ఇది హృదయక్షేత్రాన్ని పండించుగాక!

ఈ శివానందలహరీ ప్రవాహం అఘము అనే దుమ్మును అణచివేయాలి. అది సుబుద్ధి అనే పెద్ద పంటకాల్వలోపొంగి పొర్లాలి. ఆ పంటకాల్వలో ప్రవహించిన ఆ నీరు నా సంసారతాపాన్ని చల్లబరచాలి. ఆ ప్రవాహజలం నా హృదయం అనే పెద్దసరస్సులోకివచ్చి నిలిచి శివానందతరంగాలలో ఎల్లప్పుడు నిండుగా ఉండాలి. అది నన్ను కాపాడుతూండాలి- అని శంకర కథామృతాన్ని నదీ ప్రవాహంతోపోల్చి మనోహరమైన కల్పనచేశారు, శంకరులవారు.

శంకరస్య చరితం కథామృతం
చంద్రశేఖర గుణానుకీర్తనమ్
నీలకంఠ! తవ పాదసేవనం
సంభవంతు మమ జన్మజన్మని

## 3. మహాదేవుడు

త్రయీవేద్యం హృద్యం త్రిపురహర మాద్యం త్రినయనం
జటాభారోదారం చలదురగహారం మృగధరమ్,
మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిం
చిదాలంబం సాంబం శివ మతివిడంబం హృది భజే!

### పద్యం

వేదత్రయమ్ముచే వివరింపబడువాడు
మోహనరూప మనోహరుండు
సబలుడై త్రిపురముల్ సంహరించినవాడు
సృష్టికి పూర్వుడై వెలుగువాడు
మూడు తేజమ్ముల మూడుకన్నుల వాడు
దంబు జటాకిరీటంబు వాడు
ఆచార్య విలసద్గుణౌదార్యవంతుడు
పూత్కార పన్నగభూషణుండు

మృగధరుడు- మహాదేవుండు- ఈశ్వరుండు-
నన్ను దయజూచువాడు- ఆనందకరుడు-
పార్వతీపతి- పశుపతి- పరమపతిని
జ్ఞానమూర్తిని సేవింతు స్వాంతమందు

## వ్యాఖ్య

చిదాలంబా ! సాంబా ! నీ ఘనత వేదాలవల్లనే తెలుస్తుంది. నీ రూపం మనోహరం. రాక్షస మాయాశక్తులకు నిలయాలైన త్రిపురాలను జయించావు. దానితో దేహభ్రాంతిని దూరంచేసిన వాడవైనావు. సృష్టికి పూర్వమే ఉన్నావు. సూర్యచంద్రాగ్నులు అనే మూడు మూల తేజస్సులను కన్నులుగా చేసుకొన్నావు. ఆకాశమే నీకు జడలు. ఆ జడలే నీకు కిరీటాలు. ఔదార్యమునకు నీది ఆచార్య పీఠం. ఫణిరాజులు మణిహారాలై నిన్ను సేవిస్తుంటాయి. అందమైన హరిణ బాల చేతిలో చెలువం చిందిస్తోంది. నీవు మహాదేవుడవు. అమరాధు లందరికి అధిపతివి. నన్ను అత్యంత వాత్సల్యంతో చూచే దయామయుడవు. అనవరతం ఆనందం ప్రసాదించేవాడవు. పార్వతీపతివి - పశుపతివి - పరమపతివి. జ్ఞాన మూర్తివి. శివుడవు. కల్యాణమూర్తివి. నిన్ను సదా నా హృదయ చక్రంలో నిలిపి ఆరాధిస్తూ శివానందలహరిలో ఓలలాడుతూంటాను.

యో వేదాదౌ స్వరః ప్రోక్తో<br>
వేదాంతేచ ప్రతిష్ఠితః<br>
తస్య ప్రకృతి లీనస్య<br>
యః పరస్స మహేశ్వరః      -శుకరహస్యోపనిషత్తు

# 4. ఏకైక ఫలప్రదాత

సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదాః
నమన్యే స్వప్నేవా తదనుసరణం తత్కృతఫలమ్,
హరి బ్రహ్మాదీనాం అపి నికటభాజా మసులభం
చిరంయాచే శంభో శివ తవపదాంభోజ భజనమ్

పద్యం

వరపదయాబ్ధి! నీ పాదాబ్జములు వీడి
పరుల పాదమ్ములు పట్టజాల!
అక్షయవరదాత! అల్పభోగాలిచ్చు
చిల్లర దేవుళ్ళ జేరజాల
భక్త చింతామణీ! భ్రమలలోపడి గాజు
పెంకుల కొరకు పర్వెత్తజాల!
వరకామధేను! పైపై తళుకులను జూచి
గొడ్డుటావుల పాలు గోరజాల!

ఆ త్రిమూర్తులకే అలభ్యమ్మైన
నీ పదాంబుజంబులు మదినిలిపి సతము
ధ్యాన మొనరించుకొందు మహానుభావ!
శివ! మహాదేవ! కృప దయసేయుమయ్య

## వ్యాఖ్య

పరమశివా ! దయా సముద్రా ! అక్షయ వరప్రదాతా! భక్త చింతామణీ! కామధేనూ ! నీ పాదారాధన విడిచి అల్ప ఫలాలు ఇచ్చే క్షుద్ర దేవతల పాదాలు పట్టి అర్థించలేను. భ్రమలోపడి మణులను వీడి గాజుపెంకుల వెంటపరుగెత్త లేను. పాలు యిచ్చే కామధేనువును కాదని గొడ్డుటావు వెంట కుండగొని పోవలేను.

హరిబ్రహ్మాదులకే లభ్యములుకాని నీ పవిత్ర పాద పద్మాలను నా హృదయ చక్రంలో నిలుపుకొని నిత్యం ధ్యానం చేసుకొంటాను. మహాదేవా! నన్ను దయజూడు. నీవు ఒక్కడవే శాశ్వతుడవు. నిన్ను వేడుకొంటున్నాను. జీవన్ముక్తిని ప్రసాదించు.

జీవుని పరమ ఆకాంక్ష శివానందలహరీ విహారమే - అని పరమశివుని వరదాన వైభవం సదాశివత్వం సర్వాతిశయత్వం వర్ణింపబడింది.

శివ ఏకో ధ్యేయః
శివంకరః సర్వమన్యత్పరిత్యజ్య -అధర్వ శిరోపనిషత్తు

## 5. పశువు

స్మృతౌ శాస్త్రే వైద్యే శకున కవితాగాన ఫణితౌ
పురాణే మంత్రే వా స్తుతి నటన హాస్యే ష్వ చతురః,
కథం రాజ్ఞాం ప్రీతిర్భవతి మయి కోహం పశుపతే
పశుం మాం సర్వజ్ఞ ప్రథిత కృతయా పాలయవిభో

పద్యం

వైద్య రహస్యార్థ విద్యాదులనెరుంగ
స్మృత్యాగమములు పఠించి యెరుగ
సంగీత సాహిత్య సరస గోష్ఠు లెరుంగ
మంత్ర తంత్రమ్ము లేమాత్ర మెరుగ
ఆస్థానములలోని అవనీశుల నెరుంగ
మనుజ సంస్తుతియన్న మాటనెరుగ
నాట్యమ్ము గానమ్ము నవకావ్యము లెరుంగ
హాస్య ప్రసంగ విన్యాస మెరుగ

ఎట్లు మెప్పింతు రాజరాజేశ్వరులను
దేవ! సర్వజ్ఞ! మర్మజ్ఞ! దీనబంధు!
ఏను పశువును నాకేమి ఎరుకగలదు
పశుపతీ! నన్ను నీవె కాపాడవలయు!

## వ్యాఖ్య

సర్వజ్ఞా ! సర్వేశ్వరా ! పరమశివా ! పశుపతీ !

నేను నిజంగా పశువునే. నేను ఏమీ నేర్చుకోలేదు. మనుస్మృత్యాదులు పఠించలేదు, ధర్మాలు ఎరుగను. తర్క శాస్త్రాదులు అభ్యసించలేదు. నాకు భాషా వైదుష్యాదులు లేవు. మానవుల వ్యాధి నివారణోపాయాల్ని చెప్పే వైద్య విద్య చూడలేదు. శకునాలు చెప్పే శాస్త్ర పాండిత్యమూ లేదు. సంగీత సాహిత్యాలు, కవితా సౌందర్యాలు, పురాణాలు, మంత్రాలు, తంత్రాలు నాకేమీ తెలియవు. ఎవరి ఆస్థానాలకు వెళ్ళలేదు. ఎవరినీ పొగడ లేదు. నాట్యాలు, గానాలూ, కావ్యాలూ ఎరుగను. హాస్య శృంగార రస ప్రసంగాలు చేయటం చేత కాని పని. సామాన్యంగా అందరూ ఇవి నేర్చుకొని రాజులను మెప్పించి పేరు ప్రతిష్ఠలు పొందుతారు.

నీవు అన్నీ తెలిసినవాడివి, దీనబాంధవుడవు, అనాథనాథుడవు. పశుతుల్యుడ నైన నన్ను నీవే రక్షించాలి. నీవుకాదంటే నాకు వేరే దిక్కు లేదు. ప్రభూ నీవే నాకు శరణాగతి.

ఈశ్వరస్యా ప్యభిమాన ద్వేషిత్వాత్
దైన్యం ప్రియత్వా చ్చ — నారదసూత్రం

## 6. శుష్కతర్కాలు

ఘటోవా మృత్పిండో ఒప్యణురపిచ ధూమోగ్నిరచలః
పటోవా తంతుర్వా పరిహరతి కిం ఘోరశమనమ్,
వృథా కంఠక్షోభం వహసి తరసా తర్కవచసా
పదాంభోజం శంభోర్భజ పరమసౌఖ్యం వ్రజసుధీః

పద్యం

ఘటనిర్మితికి మూలకారణంబగు మట్టి
మట్టికి అణువులు పుట్టినిల్లు
పొగయున్నచోటగ్ని పుట్టిన స్థానమ్ము
కొండపై పొగయున్న నుండు నగ్ని
దారమాధారమ్ము చీరకు తర్కింప
దారమ్మునకు దూది కారణమ్ము
కుడ్యమ్ము ముఖ్యమ్ము గురుచిత్రములకెల్ల
కుడ్యమ్మునకు పాదు కొండరాయి

ఇట్టి తర్కాలు శాంతి చూపెట్టలేవు
శుష్క శాస్త్రాధ్యయన మహాసూరివర్య!
సాయిశివ పాదపద్మాల ఆశ్రయింపు
అమృతపదవిలో మాధుర్య మనుభవింపు

## వ్యాఖ్య

ఓ పండితులారా! ధీరాగ్రగణ్యులారా! కేవలం శాస్త్రచర్చలు జీవన్ముక్తికి తోడ్పడవు. మీలో మీరు-"ఈ ఘటమునకు మృత్తికఆధారం. మృత్తికకు అణువులు ఆధారం. అణువులకు పరమాణువులు ఆధారం. ఐతే ఘటానికి ప్రధానం మృత్తికా, అణువులా, పరమాణువులా?'' అని చేసే తర్కవాదాలూ—

"అదిగో కొండ. కొండపై పొగవస్తున్నది. పొగవస్తున్నది అంటే అగ్ని ఉండి ఉండాలి"అని చేసే హేతువాదనిర్ణయాలూ—

"వస్త్రమున్నది కదా. ఇది ఏర్పడటానికి దారం ఆధారం-దారం ఏర్పడటానికి ప్రత్తి''అని—

అలానే "చిత్రానికి తెర ఆధారం కావాలి. ఆ తెర నిలవటానికి గోడ, గోడకు పునాది కొండరాయి"అని చేసే చర్చలూ కంఠశోషయేకాని మోక్షసాధన కుపయోగించేవికావు. మృత్యువును జయించేవీకావు. ఇవి కట్టిపెట్టి అమూల్యమైన ఆయుఃకాలం వ్యర్థం చేయకుండా తనువులో బలం ఉన్నప్పుడే మృత్యుంజయ స్వామి పాదపద్మాలు ఆరాధించండి. ముక్తిప్రదాతయైన ఈశ్వరుని నామస్మరణంచేయి నీకు హాయి- అని ప్రబోధంచేశారు శంకరులవారు.

భజ గోవిందం భజ గోవిందం
గోవిందం భజ మూఢమతే
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహి నహి రక్షతి డుకృఙ్కరణే -గీత గోవిందం

## 7. నా ఇంద్రియాలు

మనస్తే పాదాబ్జే నివసతు వచః స్తోత్ర ఫణితౌ
కర శ్చాభ్యర్చాయాం శ్రుతిరపి కథాకర్ణనవిధౌ,
తవ ధ్యానే బుద్ధి ర్నయన యుగళం మూర్తివిభవే
పరగ్రంథైః కిం వా పరమ శివ జానే పరమతః

పద్యం

జ్ఞానస్వరూప! నా "మానస భ్రమరమ్ము"
నీ పాదపద్మ కర్ణికను చుట్టి
వాత్సల్యమూర్తి! నా "వాక్సుధా ధారలు"
నీ స్తోత్ర మందాకినిని మునింగి
ఐశ్వర్యధుర్య! నా "హస్త కంజాతాలు"
భవదీయ శుశ్రూష పరిమళించి
నాగేంద్రభూషణా! "నవకర్ణ పర్ణాలు"
నీ కథా ఫల తతిన్ నింపిపట్టి

"మతి" భవత్ పదధ్యాన సమాధియందు
"చూపు" నీ జగన్మోహన రూపమందు
నిశ్చలతకల్గి సర్వదా నిలుచునట్లు
శివ! మహాదేవ! కృప దయసేయుమయ్యా!

వ్యాఖ్య

పరమశివా! సాయిదేవా! జ్ఞానస్వరూపా! నిర్ధూతపాపా! నా మనస్సు ఒక తుమ్మెదయై నీ పాదపద్మంపై వ్రాలి కర్ణికపై నిలిచి భక్తిమరందాన్ని పానం చేస్తూండాలి.

వాత్సల్యమూర్తీ! నావాక్కులు సుధాధారలై మధురభావాల జాలులో ప్రవహించి నీ పవిత్ర స్తోత్ర సముద్రంలో లీనమై చరితార్థాలు కావాలి. మహైశ్వర్యప్రదా! నా హస్తపద్మాలు నీ సమస్తోపచారాలతో పరిమళించి బాగుగా వికసించాలి.

నాగేంద్రభూషణా! నా కర్ణపుటాలు నానా మహిమాన్వితాలైన నీ కథామృత ఫలాలు నిండుగా పట్టుకొని నిరంతరం ప్రకాశిస్తూండాలి. మహాదేవా! నా మనస్సు సహస్రారవిందంలో సాంబమూర్తివై వెలుగొందే నిన్ను ధ్యానిస్తూండాలి. కామ్యదా! నా కన్నులలోని చూపు భ్రూ మధ్యంలో నిలిచి నీ అనంతరూప వైభవాన్ని దర్శిస్తూండాలి.

ఇలా నా ఇంద్రియాలు నీ పరిచర్యా సౌభాగ్యంలో నిమగ్నమై ఉండేలా దయజూడు స్వామీ! సర్వేంద్రియాలు సాయీశ్వరార్పణం కావాలి. ఇదే భక్తుని పరమలక్ష్యం. ప్రహ్లాదుడిదే అంటాడు.

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ -భాగవతం

## 8. మోహజాలము

యథా బుద్ధి శ్శుక్తౌ రజతమితి కాచాశ్మని మణి
ర్జలే పైష్టే క్షీరం భవతి మృగతృష్ణాసు సలిలం,
తథా దేవ భ్రాంత్యా భజతి భవదన్యం జడజనో
మహాదేవేశం త్వాం మనసి చ నమత్వా పశుపతే

పద్యం

గిరిజా మనోహరా ! తరుణేందు శేఖరా!
'ము త్తకాంతిని వెండిముద్ద' లనుచు
త్రిపురాసురవిదార! త్రినయన శృంగార!
'తళుకుపూసలను రత్నమ్ము' లనుచు
సత్యసాయీశ్వరా! సర్వలోకేశ్వరా!
'పిండినీళ్ళను పాలపిండు' లనుచు
ఆశ్రితమందార! ఆనంద సంచార!
'ఎండమావుల జలముండు' ననుచు

మద మహామోహ గర్వితుల్ మందమతులు
సాయి! నీ పాదపద్మ పూజనము విడిచి
క్షుద్రదేవతోపాసనల్ కూర్మిచేసి
ఛిద్రముల కూలుచున్నారు శివ మహేశ!

## వ్యాఖ్య

గిరిజామనోహరా! శంకరా! మానవులు పెక్కు భ్రమలలో పడి నిజ వస్తు తత్త్వం తెలుసుకోలేక మాయవస్తువుల వెంటబడి నశించిపోతున్నారు. ముత్తెపు చిప్పలోని ధవళకాంతిని చూచి వెండియే అనుకొని — తళుకు పూసలను చూచి రత్నమ్ములు అనుకొని — పిండినీళ్ళను చూచి పాలు అనుకొని — ఎండమావులలో నీళ్ళు ఉన్నవి అనుకొని—

మద మోహ మాత్సర్య మాయాగ్రస్తులైన మందమతులు భ్రమలో పడి సత్యం తెలుసుకోలేక పోతున్నారు. భోగలాలసులై క్షుద్రదేవతలను ఉపాసించి ముక్తి ప్రదాతవైన నిన్ను మరచి అల్ప సుఖాలకై అల్పులను ఆశ్రయిస్తున్నారు. అదే శాశ్వత సుఖం అనుకొని మురిసిపోతున్నారు. నరకాలలో కూలిపోతున్నారు.

శివా! నిన్ను భజించినవారు నిరుపమాన నిర్మలానందం పొందుతారు. 'మూఢాః ప్రపద్యంతేఽన్య దేవతాః' అని గీత ప్రబోధిస్తున్నది.

శివ ఏవ సదా ధ్యేయ
స్సర్వ సంసార మోచక — శరభోపనిషత్తు

## 9. ఆత్మపుష్పాలు

గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలేచ భ్రమతి కుసుమార్థం జడమతిః,
సమర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ భవతే
సుఖే నావస్థాతుం జన ఇహ న జానాతి కిమహో !

పద్యం

నీరజార్చనకు గంభీర కాసారాల
దిగి లేత తీవెలు త్రెంచతగునె !
లక్షపత్రికిగాను వృక్షాల నెగబ్రాకి
చిరుకొమ్మలను బట్టి విరువతగునె !
కోటిపూజలు సేయ కొండకోనల కేగి
కుసుమబాలల గొంతుకోయ తగునె !
క్షీరాభిషేకాలు చేయగా కాంక్షించి
పెయ్యమూతులు గట్టి పితుకదగునె !
ఆత్మ దగ్గరి మృదు మానసాంబుజములు
గిల్లి నీ పాదపూజ సాగింపలేక
జడమతియకాక ఈ రీతి సలుపతగునె ।
సత్య శివ సుందర మహేశ ! నిత్యసాయి !

## వ్యాఖ్య

ఉమానాథా ! సాయీశ్వరా ! సాంబా ! సత్యశివసుందర మహేశ్వరా !

నీకు మానసాంబుజాలు సమర్పించలేని మందబుద్ధులు బాహ్యపూజకై ఎంత ఆడంబరం చేస్తున్నారు. నీకు సహస్ర సారసార్చన చేయాలని, లోతైన సరోవరాలలో దిగి తీగలు త్రెంచి ఎన్నో తామరపూలు త్రుంచుకు వస్తున్నారు. లక్ష బిల్వార్చనలకని అడవులలోకి వెళ్ళి లేత లేత మారేడుకొమ్మలు బస్తాలకొద్ది తెచ్చి గుట్టలు పోస్తున్నారు. కోటి పత్రి పూజ అని కొండలూ కోనలూ తిరిగీ తిరిగీ కుసుమ కుమారీమణుల గొంతులు కోస్తున్నారు. క్షీరాభిషేకాలు చేయాలని లేగదూడల మూతులు బిగించి పాలన్నీ బానలకొద్దీ పిండుకవస్తున్నారు.

పాపం ! వారికి నీవు భావప్రియుడవనీ, నీకు ఆత్మారాధన అంటే అమిత ఇష్టం అనీ తెలియదు. చెప్పినా వినిపించుకోరు. మానసోద్యానవనంలో పూచిన నాల్గు చిన్నిపూలు గుణాలనే పూలు నీకు మనసారా సమర్పిస్తే నీవెంత సంతోషిస్తావో తెలియదు— అని ఇందులో శంకరులవారు సగుణారాధనకంటె మానసారాధన- సమాధి- ఇంద్రియ జయం- అత్యవసరం అని నొక్కి వక్కాణించారు. మూలాధారం మొదలు సహస్రారం వరకుగల ఆరుచక్రాలు పద్మాలు- అందులోని హృదయ పద్మంలో సదాశివుడు ఉమతోకూడి సోముడై ఉంటాడు. కనుక హృదయ పద్మ సమర్పణ ఒక్కటైన చాలా అవసరం.

'మనః పుష్పం సమర్పయేత్'

## 10. పరమానందలహరి

నరత్వం దేవత్వం నగ వన మృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాది జననమ్,
సదా త్వత్పాదాబ్జ స్మరణ పరమానందలహరీ
విహారాసక్తం చేద్ధృదయ మిహ కిం తేన వపుషా

పద్యం

పార్వతీ హృదయేశ ! సర్వలోకాధీశ !
నరుడ ఖేచరుడ వానరుడనైన
మృగధరా ! సౌవర్ణ నగధరా ! శశిధరా !
నగము ఖగము వనీమృగమునైన
శ్రీకాళహస్తీశ ! సృష్ట్యాది భూతేశ !
తరువు చెరువు సాలెపురుగునైన
ఆత్మతేజోరూప ! ఆనంద రసదీప !
పిల్లి జాబిల్లి శ్రీవల్లినైన

జన్మ ఏదైనగాని విశ్వ స్వరూప !
ప్రభువు పాదారవింద మరంద బిందు
తుందిలానురాగ పరమానందలహరి
ఈదులాడెడి చిన్నారి ఎడద నిమ్ము—

## వ్యాఖ్య

సాయీ ! పార్వతీశా ! సర్వలోకాధీశా ! నాకు ముందు ముందు ఏ జన్మ ప్రసాదించినా ప్రభు పాదభక్తి రసంతో నిండిన హృదయం ఉండేలా చూడు ప్రభూ !

స్వామీ! నన్ను నరునిగా వానరునిగా, రాక్షసునిగా ఎలా పుట్టించినా పరవా లేదు. మృగధరా! మేరుధరా ! శశిధరా! శివా! నన్ను కొండగా చేసినా, పక్షిగా చేసినా, వనంలో మృగంగా చేసినా, దిగులు పడను.

శ్రీ కాళహస్తీశ్వరా ! సర్వభూతపతీ ! నన్ను చెట్టుగా, సరోవరంగా సాలెపురుగుగా ఎలా సృజించినా నొచ్చుకోను.

ఆత్మ తేజోమూర్తీ! ఆనందప్రదాయీ సాయీ! నన్ను పిల్లిగా జన్మింపజేసినా చందమామగా ఆకాశంలో నిలిపినా శ్రీవల్లిగా నందనవనంలో మొలిపించినా ఏమీ అనుకోను.

కానీ దేహం ఏదైనా హృదయంలో నీ పాద పద్మ సంస్మరణానంద లహరీ ప్రవాహం నిండుగా ఉండేలా చేయి స్వామీ.

ఉడుత- వానరులు- రాక్షసుడైన విభీషణాదులు- భల్లూకం- పక్షియైన జటాయువు పరమభక్తితో పరమపదాన్ని అందుకోలేదా ! హస్తి, సాలెపురుగు, సర్పం నిన్ను సేవించి తరించలేదా! కనుకదేహంకాదు ప్రధానం,దేహంలో ఆత్మ హృదయభావం ప్రధానం. నాకు బృందావనంలో చెట్టుగానో పుట్టగానో జన్మయిచ్చి నన్ను ధన్యుని చేయుడని అర్థిస్తాడు ఉద్ధవుడు.

మాం వ్యపాశ్రిత్య పాపయోనయః
అపి పరాంగతిం యాతి -భగవద్గీత

## 11. ఆశ్రమాలు

వటుర్వా గేహీవా యతిరపి జటీవా తదితరో
నరోవా యః కశ్చిద్భవతు భవ కిం తేన భవతి,
యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే
తదీయ స్త్వం శంభో భవసి భవభారం చ వహసి

పద్యం

విశ్వేశ్వరా! మహా వినయ సుందరశీల
సంపన్నుడగు బ్రహ్మచారియైన
సర్వేశ్వరా ! సదా సద్ధర్మ క్రతువుల
ఆచరించు మహాగృహస్థుడైన
కైలాసగిరివాస ! కైవల్య కాంక్షియౌ
పరమనైష్ఠిక వానప్రస్థుడైన
త్ర్యంబకా ! యోగరహస్యాదు లెరిగిన
ఆత్మ విజ్ఞాని సన్యాసియైన

హృదయపద్మమ్ము భక్తి నర్పించినపుడు
అన్ని భారాలు వహియించి అమృతపదవి
కరము అందింతువన్నది ఎరుగకున్న
శ్రమములేకాని ఇవ్వి ఆశ్రమములగునె !

## వ్యాఖ్య

విశ్వేశ్వరా! శంకరా! మానవుడు నిష్ఠతో బ్రహ్మచర్యాశ్రమంలోని ఎన్నో శ్రమలనోర్చి నియమాలు పాటించి విద్యావినయశీల సంపన్నుడైనా, సర్వేశ్వరా! గృహస్థాశ్రమంలోఅనేక కర్మలు కర్తవ్యాలు యజ్ఞయాగాలు దానాలు ధర్మాలుచేసి పేరు గలవాడైనా— కైలాసవాసా! వానప్రస్థుడై పరమనిష్ఠాగరిష్ఠుడై కేవల కైవల్య కాంక్షియైనా— త్రినేత్రా! సన్యాసియై అనేక యోగ విద్యా రహస్యాదులు ఎరిగిన పండితుడైనా—

మహాదేవా! మనః పద్మం నీకు సమర్పించి శరణాగతి కోరుకోగల భక్తి గలవాడైతేనే ముక్తికి యోగ్యుడౌతాడు లేకున్న భుక్తికి మాత్రమే యోగ్యుడు. ఈ పరమ రహస్యం తెలియకపోతే ఏ ఆశ్రమం స్వీకరించినా శ్రమ మాత్రమే మిగులుతుంది.

నాలుగాశ్రమాలలోని ఎన్ని సద్ధర్మాలు నిర్వహించినా శివ శరణాగతి అత్యవసరం అనే విషయం తెలుసుకోవాలి. ఈశ్వరోపాసనకంటె భిన్నమైన పంచాగ్నివిద్య, అశ్వమేధం, దృఢ బ్రహ్మచర్యం మొదలైనవి పాటించిన వారికి బ్రహ్మలోక ప్రాప్తి గలదనేది నిజమేకానీ బ్రహ్మకల్పం తర్వాత వారికి పునర్భవం తప్పదు.

గుహాదులలో శబ్దం మారుమ్రోగినట్లు భక్తుని హృదయ గుహలో 'నేను నీ వాడను' అంటే మళ్ళీ "నేను నీ వాడనే" అనేది మారుమ్రోగాలి. అట్టి భక్తుని యోగక్షేమాలు భగవంతుడు చూస్తాడు. శివుడు మరోజన్మలేని ముక్తిపదం ఈయగల ఏకైక దేవుడు—

ఆ బ్రహ్మ భువనా ల్లోకాః పురరావృత్తి నోఽర్జున
మాముపేత్య తు కౌంతేయ! పునర్జన్మ న విద్యతే —భగవద్గీత

## 12. వివిధయోగాలు

గుహాయాం గేహేవా బహిరపి వనే వాద్రిశిఖరే
జలేవా వహ్నౌవా వసతు వసతేః కిం వద ఫలమ్
సదా యస్యై వాంతఃకరణ మపి శంభో తవ పదే
స్థితం చేద్యోగోఽసౌ సచ పరమయోగీ సచ సుఖీ

పద్యం

పరమేశ్వరా! ఘోర పర్వత గుహాలలో
ఒక్కడై హఠయోగమూనుగాక—
గంగాధరా! హైమ గంగా జలాలలో
శిష్టుడై తపమును చేయుగాక—
పంచాస్త్రహర! తీక్ష్ణ పంచాగ్ని మధ్యలో
ఒంటి కాలివయి నిల్చుండుగాక—
వామదేవా! శీత వాతాతపాలలో
ఒడలెండగ సమాధినుండుగాక—

చిత్తము భవత్ పదార్పణ సేయకున్న
వాని యోగమ్ము లేల! విజ్ఞానమేల!
నీ పదాలపై చిత్తమ్ము నిలుపు వాడె
ఉత్తమోత్తమ యోగివంద్యుండు గాదె—

## వ్యాఖ్య

పరమేశ్వరా ! యోగసాధకులు నానా శ్రమలుపడి శరీరాన్ని శుష్కింపజేసి అవస్థలుపడే వారే ఎక్కువకానీ మనో నిశ్చలత గలిగి మనస్సమర్పణ చేసేవారు అరుదుగా ఉన్నారు.

శివా ! కొందరు పర్వత గుహలలో ఒంటరిగా హఠయోగాభ్యాసం చేసి ఉత్తీర్ణులౌతున్నారు. గంగాధరా ! మరికొందరు శీతకాలంలో గంగా జలాలలో దిగి విశిష్టంగా తపస్సు చేస్తున్నారు. మారహరా! ఇంకా కొందరు గ్రీష్మంలో పంచాగ్ని మధ్యంలో ఒంటి కాలుమీద నిలచి ఘోర తపస్సు చేస్తున్నారు. వాసుదేవా ! నెత్తురు గడ్డకట్టుకుపోయే చలిలో ఆరుబయట మరికొందరు జపం చేస్తున్నారు.

వారు తమ చిత్త సరోజాన్ని పరమేశ్వరార్పణ చేయాలి అనేది మరచి పోతే వారి శ్రమ అంతా వ్యర్థం కదా. మనః కమలం మహా దేవార్పణంచేసి నిశ్చల మైన భక్తిని ఉపాసించాలి. ఇంద్రియ జయం అవసరం. ఈ యోగాలు సాధనాలు ధ్యాన సమాధులు మనశ్శుద్ధికై భక్తినిశ్చలతకై ఉపయోగించాలి. కుండలినీ రూపిణియైన పరాశక్తి సహస్రారంలోని సదాశివునితో జేర్చటమే యోగ విజయం. మనస్సు బుద్ధి చిత్త అహంకారాలతో కూడిన అంతఃకరణం అభవునకు ఆలయం కావాలి.

దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవ స్సనాతనః
త్యజే దజ్ఞాన నిర్మాల్యం సోఽహం భావేన పూజయేత్

## 13. దీనరక్షకుడు

అసారే సంసారే నిజభజనదూరే జడధియా
భ్రమంతం మా మంధం పరమకృపయా పాతుముచితమ్,
మదన్యః కో దీన స్తవ కృపణ రక్షాతినిపుణః
త్వదన్యః కో వా మే త్రిజగతి శరణ్యః పశుపతే!

పద్యం

శంకరా! నీ కథాశ్రవణమ్ము సలుపక
నీ కీర్తనమ్ము విన్పించుకొనక
నటరాజ! నీ పుణ్యనామమ్ము పలుకక
నీ యంఘ్రి పరిచర్య సేయలేక
సాయీశ! నీ పదార్చన త్రోసిరాజని
తిమ్మడనై వందనమ్ము మాని
సర్వేశ! నీకు దాస్యమ్ముసేయుట వీడి
ఘనమైన నీదు సఖ్యమ్ము విడిచి
ఈశ! ఆత్మ నివేదన మెరుగకుండ
సారహీనతరంపు సంసారమందు
చెడ తిరిగి నేడు నీ కడన్ జేరినాడ
ఎవరు రక్షింపగలరు నన్నీవు గాక !

## వ్యాఖ్య

పశుపతీ! సర్వభూతాధిపతీ! శంకరా! నేను నీ కథా శ్రవణం చేయలేదు. నీ సంకీర్తన వినిపించుకోలేదు. నీ నామం స్మరించలేదు. నీ పాద పద్మాలకు అభివందనం చేయలేదు.

నటరాజా! నీ పరిచర్య చేయలేదు. నీ పాదార్చన నిర్లక్ష్యం చేశాను. నీ దాస్యం చిన్నతనంగా భావించాను. నీతో మైత్రి చేయాలని కూడ అనుకోలేదు. నీకు ఆత్మనివేదనం చేయాలనే సంగతే తెలియదు.

సాయీశ్వరా! సర్వేశా! సారహీనమైన సంసార చక్రంలో పడి నలిగి నలిగి నశించి పోతున్నాను. 'ఎక్కడా గతిలేదు' అని ఇప్పటికి తెలుసుకొన్నాను. చిట్టచివరకు నీ పాదాలే గతి అని తెలుసుకొన్నాను. నీ సన్నిధికి చేరుకొన్నాను. నన్ను నీవే చేర్చుకోవాలి. ఇంత హీనాతిహీనుణ్ణి ఎవరు రక్షింపసమర్థులు? దయా సముద్రుడివి-అనాథనాథుడివి, దీనవత్సలుడివి,ఆర్తరక్షాదక్షా! స్వామీ నీవే శరణం.

దిక్కులేనివానికి దేవుడేదిక్కు. పతితుడైనా పరమేశ్వరుణ్ణి ఆర్తితో అర్థిస్తే ఆదుకొంటాడు. భక్తిలో ఉన్న గొప్పగుణం ఇదే. అజామిళుడు వాల్మీకి మొదలైన వారెందరో భక్తిని ఆశ్రయించి పునీతులైనారు. పాపి అయినా శరణాగతి చెందితే చాలు—

అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ
తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష మహేశ్వర!

## 14. అనాథనాథ !

ప్రభు స్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే
ప్రముఖ్యోహం తేషామపి కిముత బంధుత్వ మనయోః
త్వయైవ క్షంతవ్యాః శివ మదపరాధాశ్చ సకలాః
ప్రయత్నా త్కర్తవ్యం మదవనమియం బంధుసరణిః

పద్యం

అంబామనోహరా! త్ర్యంబకస్వామి! దీ
    న జనసందోహ బాంధవుడ వీవు
చంద్రకళాధరా! జంగమేశ్వర! అతి
    దుర్బలానాథనాథుండ వీవు
దీనరక్షక! సువిజ్ఞానదాయక! గిరి
    వనచర పతితపావనుడ వీవు
పరమేశ! సత్కృపా పాథోధి కల్మషాం
    ధ ప్రేతగణ శరణమ్ము నీవు

పాలకులలోన లేడు నీవంటివాడు
పాతకులలోన లేడు నావంటి వాడు
మన పురాతన గాఢ సంబంధ మెంచి
శివశివా! నన్ను నీవె రక్షింపవలెను

## వ్యాఖ్య

శివా! అంబా మనోహరా! త్ర్యంబకేశ్వరా! నీవు దీన జన బాంధవుడవు. చంద్రకళాధరా! జంగమేశ్వరా! అనాథనాథుడవు. దీనరక్షకా! విజ్ఞానవరదాయకా! కొండకోనలలో బ్రతికే అడవి జాతులవారైన పతితులను పావనం చేసేవాడా! పతితపావనా! పరమేశా! కరుణా సముద్రా! నీవు పాపులైన భూతప్రేత గణాలనూ ఉద్ధరిస్తావు.

ఇంత దయామయుడు దేవతా పరిపాలకులలో మరొకడు లేడు. పాతకులలో నావంటి ఘోర పాతకుడు లేడు. ఇటువంటివాణ్ణి ఎవడూ రక్షించలేడు. నీవే కాపాడగల సమర్థుడవు. మా బంధుడవు. బాంధవులను ముందు చూడాలి. దగ్గరున్నవారిని ఏడిపించి దూరంగా ఉన్నవారిని కాపాడడమనేది ఏమి ధర్మం స్వామీ! శరణాగతులను రక్షించటం నీకు సహజగుణం. భక్తుల అపరాధాలు క్షమించటంలో నీకు నీవే సాటి.

మహాదేవ! మహాదేవ! మహాదేవ! దయానిధే!
భవానేవ భవానేవ భవానేవ గతిర్మమ!

# 15. బ్రహ్మగీతతుడు

ఉపేక్షా నోచే త్కిం నహరసి భవద్ధ్యానవిముఖాం
దురాశా భూయిష్ఠాం విధిలిపి మశక్తో యది భవాన్
శిర స్తద్వైధాత్రం ననఖలు సువృత్తం పశుపతే
కథంవా నిర్యత్నం కరనఖముఖేనైవ లులితమ్

పద్యం

ఆర్యావనవ్రతా! ఆర్యా మనోజాత!
నిశ్చలమ్ముగ బుద్ధి నిలువకుండె
నిర్వాణ సుఖదాయి! నిర్మాణ గుణదాయి!
మంచివైపు మనస్సు మరలకుండె
మారసంహారకా! మర్మ సంచారకా
చెడ్డకామమ్ము నశింపకుండె
ఐశ్వర్య సౌఖ్యదా! విశ్వకళ్యాణదా!
అర్థమోహము దూరమరుగకుండె

ఇట్టి విధివ్రాత తుడుచుట ఎంత నీకు
బ్రహ్మ తలను త్రుంచిన మహాబలుడ వీవు
నను ఉపేక్షింపవలదు అనాథనాథ
ఈశ! జగదీశ! సత్యసాయీ! మహేశ!

## వ్యాఖ్య

శివా! శిష్ట జనావనా! ఆర్యా దేవీప్రియా! నిన్ను ధ్యానించటానికి బుద్ధి నిలవటంలేదు. అపవర్గం అందించే అమృతవరదాతా మంచిపనులు చేయటానికి నా మనస్సు మారాము చేస్తున్నది. మదనవైరీ! సర్వాంతర్యామీ! నీకు తెలియనిదేమున్నది. చెడ్డకామం ఎంత ప్రయత్నించినా నశించటంలేదు. ఐశ్వర్యప్రదా! విశ్వకల్యాణగుణా! నాకు అర్థమోహం దూరం కావటంలేదు.

ఇలా బ్రతకమని బ్రహ్మదేవుడు నా ముఖాన వ్రాశాడు. ఆ పాడువ్రాత తుడిచి మంచిగా నేను బ్రతికేలా మంచిబుద్ధులు కలిగేలా మంచివ్రాత వ్రాయుదూ! ఒకప్పుడు బ్రహ్మ శిరమ్ము ఖండించేశావు. అంతపని చేసిన నీకు ఇది ఒక లెక్కలోనిదికాదు. నన్ను ఎందుకో ఉపేక్షచేస్తున్నావు. నేను భరించజాలను ప్రభూ! ఇంక ఉపేక్ష మాని కటాక్షించ వేడుకొంటున్నాను.

'విధి రేవ గరీయసి' అని శాస్త్ర వాక్యమున్నాకూడా అది భగవద్భక్తి హీనులకు, సామాన్యులకుకానీ భక్తులకు అదిచెల్లదు. రాత్రి చీకటిఉన్నా దీపంతో పరిహారం చేస్తాము. మార్కండేయుడు అల్పాయుష్కుడైనా శివానుగ్రహంతో దీర్ఘాయుష్మంతుడైనాడు. సత్యవంతుడు అల్పాయుష్కుడైనా సావిత్రి భక్తి శక్తి వలన చిరంజీవి అయినాడు.

యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చదుర్గమమ్
తత్సర్వం తపసా సాధ్యం తపోతి దురతిక్రమమ్

## 16. విధి

విరించిర్దీర్ఘాయు ర్భవతు భవతా తత్పరశిర
శ్ఛతుష్కం సంరక్ష్యం సఖలు భువి దైన్యం లిఖితవాన్
విచారః కోవా మాం విశదకృపయా పాతి శివ తే
కటాక్షవ్యాపారః స్వయమపిచ దీనావనపరః

పద్యం

నాల్గుతలలతోడ నాల్గు కాలంబుల
బ్రహ్మదేవుని అట్లె బ్రతుకనిమ్ము
కడగండ్లు ఒకసారె కారుమబ్బులవోలె
క్రమ్మి వైచినయేమి క్రమ్మనిమ్ము
మా ఫాలతలముల "మందభాగ్యుల" టంచు
వ్రవిల దైన్యపువ్రాత వ్రాయనిమ్ము
ఘోరాటవులలోన క్రూరమృగాలతో
జీవింపుమనుచు శాసింపనిమ్ము

నీవు మా వెంట దంటగా నిలిచియుండ
నీ విభూతి రక్షకలిగి నే వసింప
ఇతరు లెన్ని వ్రాసికొనిన యేమిభయము
సాయి! మృత్యుంజయా! దయాసారవార్ధి!

## వ్యాఖ్య

సాయీ! సాంబా! కారుణ్యసాగరా! నన్నిలా సృజించిన బ్రహ్మదేవుణ్ణి నాల్గు కాలాలపాటు బ్రతకనీ- కష్టాలన్నీ మాకే వ్రాయనీ-ఘోరారణ్యాలలో బ్రతక మని వ్రాసిన వ్రాయనీ-మందభాగ్యులు దీనులు హీనులు అని వ్రాసిన వ్రాయనీ-అవి కూడా మా మంచికే. అవి ఉంటేనే-మేము నిన్ను ఆశ్రయించేది, నీ భజనచేసేదీ నీవు ఔదార్యంచూపి రక్షించేది. కష్టాలే లేకపోతే నీసాంగత్యం నీ భక్తిమాధుర్యం లభించేది కాదేమో.

ఆయన వ్రాతలు ఏమేమి చేస్తాయి, మావెంట దంట కంట కనిపెట్టి నీ వుండగా నీ విభూతి మాకురక్ష. నీవు మృత్యుంజయుడవు. నీ కృప అపారం- నిర్హేతుకం-నీవు కాలాంతకుడవు. అచ్యుతుడు ప్రసన్నుడైతే దుఃఖాలు దూరమవు తాయి. సూర్యుడికి అభిముఖంగా నడిచేవాడికి చీకటి ఎక్కడిది?

కాలాధీశ! కాలంబు నిర్వ్యాపారంబు
గదయ్యా! జాలరు నినున్ వర్ణింప బ్రహ్మాదులున్ -భాగవతం

## 17. నా అదృష్టము

ఫలాద్వా పుణ్యానాం మయి కరుణయా వా త్వయి విభో
ప్రసన్నేపి స్వామిన్ భవ దమల పాదాబ్జయుగళమ్
కథం పశ్యేయం మాం స్థగయతి నమస్సంభ్రమజుషాం
నిలింపానాం శ్రేణి ర్నిజకనకమాణిక్య మకుటైః

పద్యం

మురవైరి బలవైరి పరమేష్ఠి నీపదా
బ్జములందు మణికిరీటములు మోప
ఇరువైపులందున రేరాజు దినరాజు
మునుముందు గోరాజు మోకరిల్ల
సురకోటి కోటీర పరివేషణములందు
శ్రీపాదములకాంతి చిందులాడ
దిగ్గేశనాథులు దీర్ఘపంక్తుల నిల్చి
భటుల బెత్తముల దెబ్బలు భరింప

నాయదృష్టమ్ము ఫలియించి నీ యపార
పరమ కారుణ్యదృష్టి నాపైన పడక
ముక్తిదమునైన నీ పదాంబుజము జూచు
భాగ్యమబ్బునా సాయి! దౌర్భాగ్యమతికి!

వ్యాఖ్య

స్వామీ! జగత్రయ విభో! నీ ప్రాభవం ఏమని వర్ణించను. శివా! దేవా! మహావిష్ణువు మహేంద్రుడు మహామహుడైన పితామహుడు ఆది దేవతామాన్యులు నీ పాదారవిందాలపై మణికిరీటాలు మోపి నమస్కరిస్తున్నారు.

రెండుపైపులా రేరాజు దినరాజులున్నారు. ముందుపైపు వృషభరాజు మోర పైకెత్తి మోకరిల్లుతున్నాడు. దేవతాకోటి కోటీర మణిమయకాంతుల వలయాలలో నీ శ్రీపాద పద్మద్వయం తేజరిల్లిపోతున్నది. ఇంకా మిగిలిన దేవతాబృందాలు వివిధ దేశాధినాధులు భటుల బెత్తముల దెబ్బలు భరించి పంక్తులలో నిలువు కాళ్ళపై నిలిచియున్నారు.

ఇంత పెద్ద మహాసభలోనికి ప్రవేశం నీపాద సందర్శనభాగ్యం నాకు కలుగటం నీ కృపాకటాక్ష విశేషంకాని అది లేక ఇదిసాధ్యమా! స్వామీ! నేను చాలా అల్పుణ్ణి- దౌర్భాగ్యుణ్ణి- దీనుణ్ణి- నన్ను సదా కరుణించు కారుణ్యసింధూ! లోకైకబంధూ! - ఇందులో స్వామి దీనవాత్సల్యం ఔదార్యం వెల్లడించబడినాయి. భక్తుడికోరిక పాదదర్శనం, స్పర్శనం, వందనం కదా!

త్వత్ పాద పద్మం మయి సన్నిధత్స్వ!

## 18. లోకైకదాత

త్వ మేకో లోకానాం పరమఫలదో దివ్యపదవీం
మహాంత స్త్వన్మూలాం పునరపి భజంతే హరిముఖాః
కియ ద్వా దాక్షిణ్యం తవ శివ మదాశాచ కియతీ
కదావా మద్రక్షాం వహసి కరుణాపూరితదృశా

పద్యం

పరిశుద్ధ! పరమాత్మ! పరమ! పరంధామ!
పరమేశ్వరా! శతవందనములు
లోకైక పతివీవె! శోకనాశకమైన
పరమార్థ ఫలమిచ్చు వాడవీవె
అమరేశ్వరుడు వాంచితార్థాలు పొందియు
ముక్తికై నిన్నె సద్భక్తి కొలుచు
ఔదార్యగుణమున కంభోనిధివి నీవు
దీనులయెడ కామధేనువీవు

నేను దీనాతిదీనుడ–నీవు దక్క
దిక్కులేనట్టి వాడను దేవ దేవ।
కనికరమ్మున సేవావకాశమిమ్ము
పదములొత్తెద సాయీశ। పాపనాశ।

## వ్యాఖ్య

పరిశుద్ధ స్వరూపా! పరమాత్మా! పరమేశ్వరా! నీవు లోకైక ప్రభుడవు. పరంధాముడవు. పరమపద ఫలప్రదాతవు. శోకనాశకుడవు. మృత్యుంజయుడవు. ఆనందదాతవు. నీకు శతవందనాలు.

దేవేంద్రులంతటి గొప్పవారు పెద్ద పెద్ద పదవులు పొంది పరమ పదం కావలసివచ్చేసరికి నీ దగ్గరకు వచ్చి నిన్నే వేడుకొంటారు. వారికెన్నో వరాలు ఇస్తుంటావు. నీ ఔదార్యం అపారం. కామ్యాలు తీర్చటంలో నీ యంతటి కారుణ్య మూర్తి మరొకరు లేరు. దీనజన కామధేనువవు నీవు.

నేను దీనాతిదీనుణ్ణి. నీవేతప్ప మరొక దిక్కు లేదు నాకు. నా కోరిక చాలా చిన్నది. ఇది తీర్చుట నీకెంత! నాకు నీ సేవాభాగ్యం కల్పించి నన్ను ఇక్కడే ఉంచుకో.

భగవంతుని సరిగా ఆరాధించక ఏవో కోరికలు కోరుతుంటే ఐహిక భోగ భాగ్యాలు పదవులు ప్రసాదిస్తాడు. దేవేంద్రాదులు సరిగా ఉపాసించక స్వర్గాధికారాలు కోరారు - స్వామి ఇచ్చాడు. ఇవి అనిత్యాలు అని గ్రహించి మోక్షం కోరి మరల అతి నిష్ఠతో ఆరాధిస్తున్నారు. అహేతుక భక్తితో భజించాలి. అప్పుడు భుక్తి ముక్తి కాక తనను తానే ఇచ్చుకుంటాడు స్వామి.

నారాధితో హరి స్సమ్యగైశ్వర్యాది ప్రదోభవేత్
ఆరాధితో హరి స్సమ్యపవర్గ ప్రదోభవేత్

## 19. నీ భక్తుడను

దురాశాభూయిష్ఠే దురధిపగృహద్వారఘటకే
దురంతే సంసారే దురితనిలయే దుఃఖజనకే
మదాయాసం కిం నవ్యపనయసి కస్యోపకృతయే
వదేయం ప్రీతిశ్చే త్తవ శివ కృతార్థాః ఖలు వయమ్

పద్యం

దుర్జన సాంగత్య దుర్మార్గ దుష్ట దు
రాశాలతా క్రూరపాశములును
దుష్టాధికార ప్రదోషావళీ గేహ
యాచనా దైన్య చింతాంతరములు
సారమ్ము లేని నిస్సార సంసార సా
గర భయంకర తరంగముల గములు
దురితాలవాల నిర్భర దుఃఖ జంబాల
పటల సంఛన్న సంపాత ఝరులు
కలుగు భవవార్ధి పడిపోతి కావు మభవ!
భక్తవత్సల! విధి నీకు భక్తుడైన
నేను మాత్రమ్ము కాన - ఓ దీననాథ!
స్రష్ట ఆతడు ఆతని సృష్టి నేను

## వ్యాఖ్య

ఓ శివా! భక్తవత్సల! దీననాథ! నేను ఈ భవసాగరంలో పడిపోయాను-ఈ జంబాలకూపంలో దుర్జనులతోడి దుర్మార్గాలు దురాశాలతలు నన్ను పాశబద్ధుణ్ణి చేస్తున్నాయి. దుష్ట దుర్మదాధికారుల గృహాలూ-గృహాలముందు యాచనా విహారాలూ చింతలూ వంతలూ నన్ను బాధిస్తున్నాయి. సారహీన సంసార సాగర తరంగాలు భయంకరంగాలేచి నన్ను భీతిల్లజేస్తున్నాయి. పాపవాగుర దుఃఖాలతో ఆచ్ఛాదితములైన ఊబి ప్రవాహాలు నన్ను లోనికి లాక్కుపోతున్నాయి.

ప్రభూ! ఇందులో కూలిపోతున్నాను. విధి నన్నిలా చేశాడు. ఆ విధి నీకు భక్తుడని వాని మాట సాగిపోయేలా చేస్తున్నావు. బ్రహ్మపై ప్రీతిచే నా మొర వినికూడ ఉపేక్ష వహిస్తున్నావు. భక్తులందరిపైన నీకు వాత్సల్యమే. బ్రహ్మ చేష్టలు ఎన్నపాలు ఆలకించినవాడవు. ఇవాళ కాకపోయినా రేపయినా నా కోరికలు మన్నిస్తావని నాకు నమ్మకం కలుగుతోంది.

దురాశవలన దుఃఖం, దుఃఖంవలన పాపం, పాపంవలన పతనం కలుగుతున్నాయి. కనుక శివా! నాకు దురాశ కలుగకుండా చేయి. విధాత నన్ను ఈ విధంగా చేశాడు- నన్ను నీవే రక్షించాలి-భక్తవత్సలా! భవా!

అకృత్వా పరసంతాపం
అగత్వా ఖల మందిరమ్
అక్లేశయిత్వా చాత్మానం
యదల్ప మపి తద్బహు

## 20. మానస మర్కటం

సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నట త్యాశాశాఖా స్వటతి ఝటితి స్వైరమభితః
కపాలిన్ భిక్షోమే హృదయ కపి మత్యంతచపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ భవదధీనం కురు విభో

పద్యం

మోహజాలము రాసిపోసిన యట్లుండు
చెరకుతోటలలోన తిరుగులాడు
కామినీ వక్షోజ గంధబంధుర శీత
కృతకాద్రి తతులపై గెంతులాడు
ద్వేష లోభాకీర్ణ వృక్ష శాఖాగ్రాల
మదమెక్కి కోతికొమ్మచ్చులాడు
శృంగారరసము లుప్పొంగు ప్రవాహాల
సుడిగుండముల దూకి జూరలాడు

కపట చపల స్వభావ శాఖామృగమ్ము
ఆదిభిక్షు! నీకిది తగినట్టులుండు
బత్తి త్రాటితో గట్టి నీకిత్తుగాని
తీసికొనిపొమ్ము నావెతల్ తీరిపోవు.

## వ్యాఖ్య

ఆదిభిక్షూ! ఆదిశంకరా! నా మనస్సు చాలా చపలమైనది. అది కోతివంటిది దానిని నీవే మంచిమార్గంలో పెట్టాలి. ఈ నా మానసమర్కటం మోహకారణమైన చెరుకుతోటలవంటి భోగాలపై పుకు పరుగులు తీస్తుంది. కామ గుణవర్ధకాలైన కామినీ కుచాద్రులపై తైతక్కలాడతానంటుంది. ద్వేష రోష లోభాదులనే వృక్ష శాఖాగ్రాలపైకి ఎగబ్రాకి కోతికొమ్మచ్చులాడుతుంటుంది. శృంగార రస. ప్రవాహాలలోని సుడిగుండాలలోదూకి మునిగి తేలుతుంటుంది.

ఇది చాలా చపలస్వభావ. దీనిని నా దగ్గర ఉంచుకోలేను. దీనితో వేగటం చాలా కష్టం మంచిమాట ఒక్కటి వినదు. నీ మాటయితే వింటుంది. నీ భిక్షుకవేషానికి తగినట్లుగా బాగా ఉంటుంది. భక్తి అనే త్రాడుతో బంధించి నీకు ఇస్తాను. తీసుకుపో, నా కష్టాలు తీర్చినవాడవవుతావు.

ఇందులో మర్కటంలాంటి మనస్సును మహాదేవునికి సమర్పించటం అలంకార చమత్కారం. మనస్సును మహేశ్వరుడు స్వీకరించితే జీవుడికి పరమపదమే. భక్తుడికి మనోలయం ముఖ్యం.

బ్రహ్మాదులను సైతం కామం కలవరపెడుతుంది. కామ కాంచన విజయాకాంక్షాదులు మనిషిని మాయలో పడవేస్తాయి. మనస్సు మర్కటమై నానా కాంక్షలు కాంక్షించి అనేక వికారాలు పెడుతుంది. మనస్సు లయం కావాలి భక్తుడికి.

యద్భుక్త్వా సాధ్యతే కార్యం
స తద్యత్నే శక్తైరపి

## 21. మానస పటకుటీరము

ధృతి స్తంభాధారాం దృఢగుణనిబద్ధాం సగమనాం
విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివస సన్మార్గఘటితాం
స్మరారే మచ్చేతః స్ఫుటపటకుటీం ప్రాప్య విశదా
జయ స్వామిన్ శక్త్యాసహ శివగణైస్సేవిత విభో

పద్యం

ధీరతాస్తంభముల్ దిట్టమ్ముగానిల్పి
    దృఢమౌ గుణాలు బంధించికట్టి
ద్వాదశాంభోజ యవనికలు తీరిచి
    ప్రతిదినము పరిశుభ్రమ్ము పరచి
మందాకినీ జ్ఞానమందారపుష్పాలు
    కట్టించి అమితయోగ్యతలు గూర్చి
మెత్తమెత్తని మేల్మిప్రత్తి బత్తి లగించి
    పుణ్యకార్యముల పొన్నులనమర్చి
తీరిచితి మానస పటకుటీర మొకటి
ప్రమధులును కొల్వ పార్వతి ప్రక్కనిల్వ
దీనబాంధవ! వాంఛితాహ్వానమంది
రమ్ము సాయీశ్వరా! నివాసమ్ముసేయ

వ్యాఖ్య

ఈశ్వరా! సాయీశ్వరా! దీనబాంధవా! నా మానసం ఒకపటకుటీరంగా దిద్ది తీర్చాను. ఇందు నీవు ప్రమథగణంతో పార్వతీదేవితో వచ్చి నివాసం చేయవచ్చు. రా! స్వామీ! రా! ఆహ్వానిస్తున్నాను.

ధైర్యం అనే స్తంభాలు గట్టిగా నిలబెట్టాను. గుణాలు అనే త్రాళ్ళతో గట్టిగా బిగించి కట్టాను. గుడారం ఏర్పాటుచేశాను. దానిలో ద్వాదశ పద్మాలతో అలంకృతమైన తెరలలో గదులు ఏర్పరచాను. కుటీరాన్ని ప్రతిదినం నిర్మల గంగాతీర భూముల్లో వికసించిన మందారాలు తెచ్చి అలంకరిస్తున్నాను. భక్తి అనే దూది ఏకించి మెత్త మెత్తని పరుపులు దిండ్లు కుట్టించి ఆసనాలు శయ్యలు ఏర్పాటు చేశాను.

నీవు ప్రమథగణంతోను ప్రియురాలు పార్వతీదేవితోను వచ్చి నివాసం చేయాలి. హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాను. ఇదిఅన్ని విధాల అర్హత గలది. దృఢమైనది. నీకుయోగ్యమైనది. నీవువచ్చి నన్ను చరితార్థుణ్ణి చేయవలసింది. కమనీయ కల్పనతో నిండిన ఈకవిత మనోహరం.

" పరిశుద్ధమైనదేహం పరమేశ్వరుని ఆలయం "

## 22. మనస్తస్కరుడు

ప్రలోభాద్యై ర్థాహరణపరతంత్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్తస్సన్ భ్రమతి బహుధా తస్కరపతే,
ఇమం చేతశ్చోరం కథ మిహ సహే శంకర విభో
తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపామ్

పద్యం

వెర్రి గొల్లలయిండ్ల వెన్నలు తినివచ్చు
    చుండు పాపహర! ఒక్కొక్కసారి
మానినీ మాణిక్య మాలికల్ కాజేయు
    చుండు చిత్తహర! వేరొక్కసారి
ధనవంతు లెట్లున్న కన్నుగప్పి దోచేయు
    చుండు గుణహర! ఇంకొక్కొక్కసారి
పలుకరించినవారి పట్టి నిల్వాసముంచు
    చుండు దేవర! మరియొక్కసారి

తస్కరాధిప! నా మనస్తస్కరుండు
నటన మెంతేని నేర్చిన వటు ఖలుండు
ఎట్లుకైనను మరి నీవె పట్టవలయు
ప్రేముడిని మంచి దారిలో పెట్టవలయు

## వ్యాఖ్య

పరమేశ్వరా! పాపహరా! శంకరా! నా మనస్సు పట్టి దొంగబుద్ధి కలది! ఈ దొంగ గొల్లఇండ్లలో వెన్నలు తినివస్తుంది. చిత్తహరా! ఈ దొంగ మానినీ మణుల మాణిక్య హారాలు కాజేస్తుంటుంది. గుణహరా! ఈ దొంగ ధనవంతు లెంత జాగ్రత్తగా ఉన్నా వారి కన్నుగప్పి మోసంచేసి ప్రతివస్తువునూ దోచేస్తుంటుంది. దేవరా! ఈ దొంగ ఎదురుపడి పలకరించిన వారిని నిలువునా దోపిడీ చేస్తుంటుంది. ఈ ఖల బుద్ధిని నీవేమార్చాలి. మంచి మార్గంలో పెట్టాలి, ఈ దొంగ బుద్ధులను దారిలోపెట్టే సమర్థుడవు నీవేకాని మరొకడు ఎవ్వడూ లేడు. వీడు నా స్వాధీనంలో ఉండటంలేదు.

నీవు తస్కరాధిపతివి. వారిని అదిలించి మంచి మార్గంలో పెట్టే సమర్థుడవు, నా మొరవిని నా మర్యాద కాపాడు ప్రభూ! నీ కాళ్ళు పట్టుకొంటాను.

'తస్కరాణాంపతయే నమః!'

## 23. జీవన్ముక్తి

కరోమి త్వత్పూజాం సపది సుఖదో మే భవ విభో
విధిత్వం విష్ణుత్వం దిశసి ఖలు తస్యాః ఫలమితి
పునశ్చ త్వాం ద్రష్టుం దివి భువి వహన్ పక్షిమృగతా
మదృష్ట్వా తత్ఖేదం కథమిహ సహే శంకర విభో

పద్యం

నీ పాదపూజకు నిండు ఫలమ్మని
శ్రీవిష్ణుగా నన్ను చేసితేని
ఒక వరాహమ్మునై ఉర్వి జొరబడి నీ
పదమూలమును సుంత వెదకలేను
నీ ధ్యానమునకంచు నెమ్మది నువ్వొంగి
విధిగాను నన్ను గావించితేని
ఒక హంసనై కూడ ఒక్కింత నీ శిరో
జాగ్రమ్ము గగనాన అరయలేను
సాయి! పరమేశ! ఏదైన ఈయగలవు
అంత గొప్పలకేగి ఆయాసపడుట
శృంగభంగమ్ములగుట నాకేలగాని
ఇచట సుంత జీవన్ముక్తి ఇమ్ము చాలు

## వ్యాఖ్య

ఓ సాయీశ్వరా! భక్త కల్ప తరువా! నీ దయ అపారం. అడిగినదాని కంటె అధికంగా ఇస్తావు. ఎంత పెద్ద గొప్ప వరం అయినా వేగమే ఈయగలవు. వీడు నన్ను గూర్చి బాగా భజించాడు అని విష్ణు పదవి ఇచ్చావనుకో. నేను వరాహమునై నీపాదపద్మములు వెతకలేను. వీడు బాగా ధ్యానం చేశాడు. సమాధి బాగా నిలపగలడు. తగినవాడు అని బ్రహ్మ పదవికి నన్ను పంపావు అనుకో. నేను హంసనై కూడ నీ శిరోజాగ్రం ఆకాశమంతా వెతకి పట్టుకోలేను.

నీకేమి! నీవేమైనా ఇస్తావు. కానీ నేను దక్కించుకోవద్దూ. ఆ గొప్పలు నాకెందుకులేకానీ ఇసుమంత జీవన్ముక్తి ఇమ్ము చాలు. నాకు దురాశలు లేవు.

దీనిలో మహేశ్వరుడి మహాత్మ్యం తెలిపే పురాణగాథ సూచితమైనది. శివుడి పాదంవెతకి పట్టుకొంటానని హరి వరాహమై భూమిలోనికి జొరబడి వెళ్ళి వెతకలేకపోయాడు. వినయంతో సత్యం గ్రహించి ప్రణమిల్లాడు. శివుడి శీర్షం కనుక్కొంటానని విధి పరమ హంసయై కూడ దర్శించలేకపోయాడు. సత్యం ఒప్పుకోవటానికి అహంకారం అడ్డువచ్చి 'చూచాను' అని కామధేనువును మొగలి పూవును సాక్ష్యం చెప్పమన్నాడు. అహంకారం జయించలేని నీకు పూజలు జరగవు. తప్పుడు సాక్ష్యం కోసం వచ్చిన మొగలిపూవు పూజకు అనర్హము అన్నాడు శివుడు. ధేనువు ముఖంతో అల్లే అని తలఊపి తోకతో అది అబద్ధం అందిట. అందువల్ల ధేనువు పృష్ఠభాగం దర్శనీయం అనీ ముఖం అదర్శనీయమని పురాణగాథ.

బ్రహ్మ విష్ణువులే నీ ఆద్యంతములు తెలుసుకోలేరు. నేనెంత ఓ శివా! నాకు ముక్తినియ్యి భక్తితో సేవిస్తాను.

ఓంకార మంత్ర సంయుక్తం
నిత్య ధ్యాయంతి యోగినః
కామదం మోక్షదం తస్మై
నకారాయ నమో నమః

# 24. శివ వైభవం

కదా వా కైలాసే కనకమణిసౌధే సహగణై
ర్వసన్ శంభో ర(గ్రే స్ఫుటఘటితమూర్ధాంజలి పుటః
విభో సాంబ స్వామిన్ పరమశివ పాహీతి నిగదన్
విధాతౄణాం కల్పాన్ క్షణమివ వినేష్యామి సుఖతః

పద్యం

రజత ప్రభాపూర్ణ రమ్య కైలాసాద్రి
మందార వాటికా మధ్యమందు
మాణిక్య వైఢూర్య మరకత స్థగితాభ
వరసౌధ ముఖమంటపమ్ము నందు
ప్రమథ దేవ గణాధిప వ్యూహ గాంధర్వ
జయజయానంద ఘోషమ్ములందు
"మృత్యుంజయా! పరమేశ్వరా!" అనెడి నా
రద తుంబురు బహుపరాకులందు
"శివమహాదేవ! సాయీశ! శ్రీ గళాంక!"
అనెడి మధురాతి మధుర కీర్తనములందు
కల్పములు క్షణాలుగ నెప్డు గడపగలనొ
సుంత కృప జూడుమా! కరుణాంతరంగ!

వ్యాఖ్య

మహాదేవా! నీ మహావైభవం మహైశ్వర్యం నా కనులారా చూడాలని ఉంది స్వామీ! ఆ మధుర క్షణం ఎప్పుడు అనుగ్రహిస్తావో కదా! ఆ పరిశుద్ధ పరిశుభ్ర ధవళ ధగద్ధగల కైలాసాద్రి, ఆఅద్రిపై మధుర మంజుల మందార పుష్ప వాటిక, ఆ వాటికా మధ్యంలో మణిమయ మహా మాణిక్య రత్న మందిరం. ఆ మందిర ప్రాంగణంలో మెరిసి పోయే సహస్ర స్తంభ మంటపం- ఆ మంటపంలో దేవ గాంధర్వ ఆనంద మంగళ ధ్వని.

పార్వతీపతీ! బహువరాక్! పాహి పరమేశ్వరా! అనే నారదాదుల వంది స్తోత్ర స్రవంతి- మధుర మహిత లలిత కీర్తనలు- దేవకోటి సంస్తవం వీటితో నిండిన నీ సంస్థాన మహావైభవం చూస్తూ నీ సభలో సభ్యుడిగా ఉండి యుగ యుగాలను క్షణాలుగా గడపాలని మహాకాంక్ష ప్రభూ! కటాక్షించు కళ్యాణ గుణధామా!

ఈ కైలాసం బ్రహ్మాండం. సదాశివ మహాసౌధం సహస్రారం. అందు విభుడు సతియితో గూడిన సాయీశ్వరుడు సదాసాంబశివుడు. హంస స్వరూపుడైన యోగభక్తుడు బ్రహ్మానందం అనే శివానందం అనుభవింప ఆరాటపడు తున్నాడు.

ఇది అంతర పూజకు ధ్యానమునకు ప్రతీక. సుషుప్తి సుఖం- సాధారణ జనుల సుఖం కంటె చక్రవర్తి సుఖంశ్రేష్ఠం.చక్రవర్తి సుఖం కంటె స్వర్గసుఖం దానికంటె బ్రహ్మలోక సుఖం శ్రేష్ఠం. దానికంటె పరమేశ్వర సాన్నిధ్య సుఖం శ్రేష్ఠతరం. అది ఊహాతీతం.

'హోపు హోపు హోపు' -శ్రుతి

# 25 శివ విభూతి

స్తవై ర్బ్రహ్మాదీనాం జయజయవచోభి ర్నియమినాం
గణానాం కేళీభి ర్మదకలమహోక్షస్య కకుది
స్థితం నీలగ్రీవం త్రినయన ముమా శ్లిష్టవపుషం
కదా త్వాం పశ్యేయం కరధృతమృగం ఖండపరశుమ్

పద్యం

బ్రహ్మాదిదేవతల్ బహుపరాకులతోడ
జయజయధ్వానముల్ జరుపుచుండ
భూతగణంబెల్ల ప్రీతితో నీ ముందు
శివమెత్తి నాట్యాలు సేయుచుండ
వృషభేశ్వరుండు మోరెత్తి బ్రహ్మాండమ్ము
ప్రతిశబ్దమిడ ఒకఱంకెవేయ
నీ మహైశ్వర్యమ్ము నేత్రాలగని పొంగి
గౌరీమహాదేవి కౌగిలింప

నీలకంఠమ్ము సొగసు - త్రినేత్ర గరిమ-
చేతి హరిణమ్ము అందమ్ము చిందులాడ
నిరుపమానోన్నతంబైన నీ విభూతి
గాంచు భాగ్యమ్ము నాకెప్డు కలుగు దేవ!

వ్యాఖ్య

సాయీశా! మహేశా! నీపై భవ శివమూర్తిని దర్శించాలని ఉన్నది- బ్రహ్మాది దేవతా సమూహాలు బారులు తీరి నిలువబడి 'జయ జయ' నినాదాలు చేస్తుండగా- నీ భూతప్రేత ప్రమథగణాలు శివంకరముగా నాట్యం చేస్తుండగా- నందీశ్వరుడు మోర పైకెత్తి బ్రహ్మాండం మారుమ్రోగేలా రంకెలు వేస్తుండగా- ఈ మహాసంరంభం చూచి గౌరీదేవి సంభ్రమించి నిన్ను కౌగిలించుచుండగా- నీ కంఠముపై మెరిసే హరినీల కాంతి సౌందర్యం చిందుతుండగా-నీ కన్నులువింత సోయగాలు వెలయిస్తుండగా- నీవు మహానందంగా ఊరేగుతున్న ఉత్సవశోభ దర్శించాలని తీవ్రకాంక్షదేవా! ఆ అదృష్టం నాకున్నదంటావా! ఎప్పుడు కలుగ జేస్తావో! ఆశుతోషా!

భగవద్వ్యసనం వలన తాము తరించి లోకాన్ని తరింపచేస్తారు ఘనులు. సనకాదులు హరి దర్శన వ్యసనంతో వైకుంఠం వెళ్ళారు. వారిని జయ విజయులనే ద్వారపాలకులు అడ్డగించారు. అంతే వారిని శపించారు ఆ మహా మునీంద్రులు- శ్రీరాముడిని చూడాలని శబరి, శ్రీకృష్ణదర్శనం కోరి గోపికలు కాళికాదేవీ దర్శనం కోసం రామకృష్ణపరమహంస పరమవిరహం అనుభవించారు. త్యాగరాజు అంటాడు-

ఎన్నడు చూతునో! ఇనకులతిలకా!
నిన్నెన్నడు చూతునో

## 26. ఇంద్రియసిద్ధి

కదా వా త్వాం దృష్ట్వా గిరిశ తవ భవ్యాంఘ్రియుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్
సమాశ్లిష్యాఘ్రాయ స్ఫుట జలజగంధాన్ పరిమళా
నలభ్యాం బ్రహ్మాద్యై ర్ముదమనుభవిష్యామి హృదయే

పద్యం

కరములుప్పొంగి నీ చరణారవిందాలు
పట్టానిముదాన పట్టుటెపుడో!
శీర్షమ్ము హర్షించి శ్రీపాదధూళిని
ఇంపారగా స్పృశియింపు టెపుడో!
కనులు విప్పారి నీ కమలాంఘ్రి వికసన
తృప్తి తీరగ తిలకించుటెపుడో!
మనసు చిదాకాశమున నీ పదమ్మును
పదిలమ్ముగా భద్రపరచుటెపుడో!

పెద్దవాడును ప్రాబల్యముద్దయైన
బ్రహ్మకందని నీ పాదపద్మ పూజ
ఎపుడు ప్రాప్తించునో కదా! హేదయాళ!
సత్యశివసుందరేశ! ప్రశాంతి వాస!

వ్యాఖ్య

శివ సుందరేశా! సాయి మహేశా! నా ఇంద్రియాలు నీ సేవ మురమార ఎప్పుడు చేస్తాయో కదా!

నా హస్తాలు సంతోషంతో పొంగిపోయి ఎప్పుడు నీ చరణారవింద సంవాహన చేస్తాయో! నా శిరస్సు ఎప్పుడు నీ పాద పద్మాల మ్రోల వ్రాలి పవిత్ర పాదధూళిని స్పృశిస్తుందో! నా నేత్రాలు ఏనాడు నీ పాదపద్మ సౌందర్యం కనులారా తిలకిస్తాయో! నా మనస్సు చిదాకాశంలో నీ పరమపద సౌవర్ణ శిఖరం దర్శించి ఆ దృష్టిని అలానే ఎప్పుడు నిలుపుకొంటుందో!

దేవతలలోకి పెద్దవాడు, వేదములు పోసిన గాదె, తెలివితేటల ముద్ద అయిన బ్రహ్మదేవునికి అందజాలని నీ పాదపూజ నాకెపుడు లభిస్తుందో! నా యింద్రియాలు అన్నీ నీ సేవా కార్యాలలో నిమగ్నమయ్యేలా ప్రేరణా, అవకాశమూ కల్పించు స్వామీ!

నీ పద్యావళు లాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీ పేరం బనిచేయు హస్తయుగమున్ నీ మూర్తిపై చూపులున్
నీ పాదంబులచెంత మ్రొక్కు శిరమున్ నీసేవపై చిత్తమున్
నీపై బుద్ధులు నాకు నిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా!

—భాగవతము

## 27. కానుక

కరస్థే హేమాద్రౌ గిరిశ నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజామరసురభి చింతామణి గణే
శిరస్థే శీతాంశౌ చరణయుగళస్థేఽఖిలశుభే
కమర్థం దాస్యేఽహం భవతు భవదర్థం మమ మనః

పద్యం

పొంగారు బంగారు రంగారు కొండ నీ
చేతియందున విరాజిల్లుచుండ
అఖిల ధనాధిపుడైన కుబేరుండు
కుడి భుజమ్మయి నిన్ను గూడియుండ
చలువ వెన్నెలపాలు చంద్రుండు శిరముపై
తీయతీయంగ చిందించుచుండ
సర్వమంగళమూర్తి చరణాలు ఒత్తుచు
వినయమ్ము నొప్ప సేవించుచుండ

కల్పవృక్షాలు భవన ప్రాంగణము నింద
కామధేనువుల్ దొడ్డిలో కాచియుండ
హే మహేశ్వరా! ఏమి అర్పింతుగాని
మనసొకటి ఉన్నదది అందుకొనుము తండ్రి!

## వ్యాఖ్య

శివా! నీకు ఏదైన విలక్షణమైన సంక్రాంతి కానుక ఈయాలని మనస్సు ఆరాటం చేస్తున్నది. ఏమియ్యగలను- ధనువు ఇచ్చుకొందాము అంటే నీ చేతిలో బంగారు కొండ మేరువు ధనువై ప్రకాశిస్తోంది. పోనీ వెండి బంగారాలు ఇద్దామంటే కుబేరుడు నిత్యం పంపిస్తున్నవే కదా.

నీకు చల్లగా ఉండే ఏ పుష్పరసాలు సమర్పిద్దాము అంటే శిరస్సుపై చంద్రుడు నిండు పండు వెన్నెలలు కుమ్మరిస్తున్నాడాయె. నీకు సేవలు చేయటానికి నా కుమారీమణిని ఇద్దాము అంటే సర్వవిధాల సర్వవేళల సర్వమంగళ నిన్ను సేవిస్తున్నది. ఫలాలు ఇద్దాము అంటే భవనం ముందు వెనుక అన్నీ కల్ప వృక్షాలే. అన్ని ఋతువులలో పండిచ్చేవేకదా. పాలు తెచ్చి ఇద్దాము అంటే పెరటి నిండా కామధేనువులే కదా.

శంకరా! సంక్రాంతిది ఏమీయగలను? అన్నీ నీ ఇదివరకు అనుభవించినవే కానీ 'మనస్సు' అనే విచిత్ర వస్తువున్నది. అది అర్పిస్తాను స్వీకరించు ప్రభూ.

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి

# 28. ముక్తిదాత

సారూప్యం తవపూజనే శివ మహాదేవేతి సంకీర్తనే
సామీప్యం శివభక్తిధుర్యజనతాసాంగత్యసంభాషణే
సాలోక్యం చ చరాచరాత్మక తనుధ్యానే భవానీపతే
సాయుజ్యం మమసిద్ధమత్రభవతి స్వామిన్ కృతార్థోస్మ్యహమ్

పద్యం

క్షీరాభిషేకమ్ము సేయుచు నీ సుధా
రూపమ్ముచూడ 'సారుప్యముక్తి'
'శివ! మహాదేవ! తాండవకళామూర్తి! స్వా
మీ!' అనునంత 'సామీప్యముక్తి'
నీభక్తవరులతో నెయ్యమ్ము సాగించు
లోపల సాయి! 'సాలోక్యముక్తి'
నీపైన స్వాంతమ్ము నిలిపి నిన్ ధ్యానించు
చున్నంతలోన 'సాయుజ్యముక్తి'

నాల్గుముక్తులన్ సత్కరుణాసముద్ర !
ఇక్కడే ! ఇప్పుడే! వేగమిచ్చినావు
నిన్ను మించిన దైవమ్ము నెన్న నెవరు ?
హే విభూతీశ ! సత్యసాయీ నమోస్తు !

## వ్యాఖ్య

సాయీశ్వరా ! ముక్తిదాత వంటే నీవే దేవా! నాల్గు ముక్తులూ ఒకేసారి ప్రసాదించగలవు స్వామీ ! దయాళూ !

నీ క్షేత్రానికి వచ్చి నీ భక్తులతో స్నేహం చేసుకొన్నంత మాత్రమున 'సాలోక్యముక్తి' ప్రసాదిస్తావు- శివా మహాదేవా! సాయీశ్వరా ! తాండవ మూర్తీ ! నటరాజా ! అని నోరార పిలిచినంతమాత్రాన సామీప్యానికి జేర్చి కాని 'సామీప్యముక్తి' అనుగ్రహిస్తావు. నీ రూపం చూస్తూ నీ కభిషేకం చేస్తూ నిన్ను పరికిస్తూన్నంత మాత్రాన సంతోషించి 'సారూప్యముక్తి' చేకూరుస్తావు. నిన్ను మనసారా ధ్యానిస్తూ ఆత్మ పీఠం పై ప్రతిష్ఠించుకొంటే చాలు 'సాయుజ్య ముక్తి' అందిస్తావు.

ఇలా నాల్గుముక్తులూ భక్తులకు సులభంగా లభింపజేసే కరుణా సముద్రుడివి. నీ సాటి దైవం ఎవరున్నారు? 'నారుద్రో రుద్రమర్చయేత్' రుద్రుడు కాక రుద్రార్చన చేయరాదు. అనుభూతులు చతుర్విధ ముక్తులు దేహ పతనానంతరం కలుగుతుంటాయి అంటారు కాని స్వామి దయదలిస్తే ఇక్కడే ఇప్పుడే పొందటం బొందితో కైలాసం పొందటమే.

"స్వామిన్ కృతార్థోఽస్మ్యహమ్"

# 29. దర్శనం

త్వత్పాదాంబుజ మర్చయామి పరమం త్వాం చింతయామ్యన్వహం
త్వామీశం శరణం వ్రజామి వచసా త్వామేవ యాచే విభో,
వీక్షాం మే దిశ చాక్షుషీం సకరుణాం దివ్యైశ్చిరం ప్రార్థితాం
శంభో లోకగురో మదీయ మనసః సౌఖ్యోపదేశం కురు

పద్యం

నీ పాదపద్మాలు నిత్యమ్ము భక్తి పూ
జించుచున్నాను శచీశవినుత!
నీ దివ్యరూపమ్ము నిండుచిత్తమున ధ్యా
నించుచున్నాను వాణీశవినుత!
నీ కథాశ్రవణమ్ము నిర్మలమతి ఆల
కించుచున్నాను లక్ష్మీశవినుత!
నీ పుణ్యచరణాలు నిరతమ్ము శరణమ్ము
వేడుచున్నాను కవీంద్రవినుత!

ఓ దయాంభోనిధి ! జగద్గురూ! మహేశ!
దేవమున్యాదులెల్ల అర్థించునట్టి
దర్శన స్పర్శన ప్రసాదమ్ము లొసగి
సదుపదేశాలు బోధించు సత్యసాయి !

## వ్యాఖ్య

దేవేంద్ర పూజితా! నీ పాద పద్మాలు నిత్యం అర్చిస్తున్నాను. బ్రహ్మాది దేవ సేవితా! నీ దివ్య రూపం చిత్తంలో నిత్యం ధ్యానిస్తున్నాను. విష్ణుదేవ వినుతా! నిర్మలమతితో నీ కథా శ్రవణం నియతితో చేస్తున్నాను. కవీంద్ర సంసేవితా! నీ చరణ నీరజాలు శరణాలని నిత్యం వేడుకొంటున్నాను.

సదుపదేశాలు చేసే జగద్గురూ ! దేవముని సిద్ధ సాధ్యాదులు అర్థించే నీ దర్శన స్పర్శన భాషణానుగ్రహాలు అందించి నన్ను కరుణించు కారుణ్యమూర్తీ! నీకు శతకోటి అభివందన సందన చందనాలు.

నీటినుండి బయటపడిన చేపవలె భక్తుని మనస్సు భగవద్దర్శనం కోసం గిజగిజలాడి పోతుంటుంది. కన్నీరు మున్నీరుగా విలపిస్తుంది.

భగవద్దర్శనాపేక్షిత విరహం లౌకిక దుఃఖాలను నిర్మూలనం చేస్తుంది నిర్మల నిర్వాణ సౌఖ్యానికి సోపానం అవుతుంది. భగవదారాధన భక్తుని కర్తవ్యం

'త్వమేవ శరణం మమ'

## 30. ఏమి అర్పింతు!

వస్త్రోద్ధూతవిధౌ సహస్ర కరతా పుష్పార్చనే విష్ణుతా
గంధే గంధవహాత్మతాన్నపచనే, బర్హిర్ముఖాధ్యక్షతా,
పాత్రే కాంచన గర్భతాస్తి మయిచే ద్బాలేందు చూడామణే
శుశ్రూషాం కరవాణి తే పశుపతే స్వామిన్ త్రిలోకీ గురో

పద్యం

వ్యాఘ్రచర్మాంబరా! వస్త్రమ్ము లర్పింప
వేయి చేతుల ప్రొద్దు వేల్పుగాను
చంద్రకళాధరా! సరసిజాలర్పింప
పుండరీకదళ నేత్రుండగాను
శ్రీ కంధరా! హరా! శ్రీ గంధ మర్పింప
గంధవహుఁడ సదాగతినిగాను
గరళవిషాహార! సరసాన్న మర్పింప
సురనాథుడగు పురందరుడగాను

పాత్రములు అర్పణము సేయ బ్రహ్మగాను
అల్పుడను ఏమిసేవచేయగలవాడ!
సకల బ్రహ్మాండ మండల సార్వభౌమ!
స్వామి! సత్యసాయీ మహేశా! నమోస్తు

వ్యాఖ్య

పశుపతీ! త్రిలోకైకపతీ! శివా! దిగంబరా! వ్యాఘ్రచర్మాంబరా! నీకు వస్త్ర యుగ్మం సమర్పించాలి అంటే వేయి చేతులుకావాలి. వేయిచేతులవేల్పు సూర్యదేవుడే నీకు సమర్థుడు.

చంద్రకళాధరా! కల్హార మనోహరా! నీ పూజ చేయటానికి సహస్ర కమలాలు కావాలి. కమలాలు కావాలి అంటే విష్ణువైన కమలలోచనుడే సంపాదింప సమర్థుడు. ఒకటి తక్కువయితే తన కంటినే ఇచ్చి పూజ పరిపూర్తి చేసిన సమర్థుడు!

శ్రీ కంధరా! నీకు పరిమళ భరిత సుగంధద్రవ్యాలు సమర్పించాలి అంటే సదాగతిగల గంధవహుడైన వాయుదేవుడే సమర్థుడు.

ప్రభూ! విషాహారా! నీకు సరసాన్నాలు నైవేద్యం హృద్యంగా పెట్టాలంటే అగ్నిదేవాదులకు అధ్యక్షుడైన దేవేంద్రుడే సమర్థుడు. హవిర్భాగాలు అగ్నిద్వారా జలాదులు మేఘాలద్వారా సంపాదించి సమర్పింపగలడు.

స్వామీ! బ్రహ్మాండ సార్వభౌమా! నీకు అర్ఘ్య పాద్యాదులకు పాత్రలు సమర్పింప సర్వ సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడే సమర్థుడు. అతడు ఏదైనా సృష్టించి అర్పించగలడు.

నీకిలా దేవోపచారాలు చేయాలి అంటే అత్యల్పుడనైన నా వలన ఏమి అవుతుంది? సాయీ! దయామయా! భావప్రియా! మానస పూజ చేస్తాను. ధ్యానిస్తాను. నా పూజ స్వీకరించు ప్రభూ! షోడశోపచారాలతో లేక పంచోపచారాలతో నైనా పూజించాలి కనుక అంతరంగ అర్చన చేస్తాను.

నా విష్ణుః కీర్తయే ద్విష్ణుం
నా విష్ణు రర్చయేత్ తన్మయాః —విష్ణుసహస్రం

# 31. పరమోపకారి

నాలంవా పరమోపకారక మిదం త్వేకం పశూనాంపతే
పశ్యన్కుక్షిగతాన్ చరాచరగణాన్ బాహ్యస్థితాన్ రక్షితుమ్
సర్వామర్త్య పలాయనౌషధ మతిజ్వాలాకరం భీకరం
నిక్షిప్తం గరళం గళేన గిళితం నోద్గీర్ణమేవ త్వయా

పద్యం

జలరాశి ద్రచ్చు విశ్వ భయంకరోద్ధృతి
తో వచ్చు గరళాగ్ని దుడుకుగాంచి
కాలకూటజ్వాల గనిన దేవాసురా
నీకాల ప్రాణాలు నిలుపదలచి
కడుపులోనున్న లోకాలు కాలుననియొ
వెలుపలి లోకాలు కలగుననియొ
పైకి లోనికి పొల్లిపడకుండ గొంతులో
పట్టి విషము అట్టె పెట్టినావు
లోకములపైని జాలి నీలోన ఎంత
నిండి నిక్షిప్తమైయుండె నీలకంఠ!
ఆశుతోషా! అపార దయావిశేష!
శేషభూషా! నమస్సులు శివ! మహేశ!

వ్యాఖ్య

పరమ శివా! పరమోపకారకా! లోకాలపై ఎంత జాలిగలదయ్యా నీకు.

సముద్ర మధనం జరుగుతుంటే మహాకాలకూటం నిప్పులు గ్రక్కుతూ పొంగి పొర్లివచ్చిందే. ఆ భయంకర ఉద్ధృత దృశ్యం చూచి దేవతలందరూ ఇక ప్రాణాలు నిలవవని భయపడుతుంటే ప్రాణాతురులైనవారిని రక్షించాలని ఈ విషం స్వీకరించావా!

ఈ విషప్రభావం వలన లోపలి లోకాలు కాలిపోతాయని లోపలికి మింగలేదా! బయటి లోకాలు భస్మమైపోతాయని బయటికి క్రక్కలేదా! లోక క్షేమం కోసం ఆ విషాన్ని క్రక్కలేక మ్రింగలేక పుక్కిటనే పట్టి ఉంచావా దేవా! లోకాల కోసం ఎంతటి కష్టాన్ని భరిస్తున్నావయ్యా! శంకరా! గరళకంఠా! సాయీశ్వరా! శత నమస్కారాలు.

శివా! నీ భార్య కూడ నీకు తగినది కనుక ప్రజలకు మేలు కలగాలి అని మ్రింగమనె సర్వ మంగళ. మంగళసూత్ర మహిమ ఆమెకు తెలుసుకదా!

హరుడు గళమునందు హాలాహలము పెట్ట
కప్పు కలిగి తొడవు కరణి నొప్పె
సాధు రక్షణంబు సజ్జనులకు నెన్న
భూషణంబుకాదె భూవరేంద్ర!

—భాగవతము

## 32. శ్రీకంఠః

జ్వాలోగ్రస్సకలామరాతిభయదః క్ష్వేళఃకథంవా త్వయా
దృష్టః కించ కరే ధృతః కరతలే కిం పక్వజంబూఫలమ్,
జిహ్వాయాం నిహితశ్చసిద్ధఘుటికా వా కంఠదేశే భృతః
కింతే నీలమణి ర్విభూషణమయం శంభో మహాత్మ న్వద

పద్యం

విశ్వభీకరమైన విషవహ్ని నీ నేత్ర
కమలమ్ములేరీతి గాంచగలిగె
విశ్వభీకరమైన విషవహ్ని నీ హస్త
పద్మమ్ములేవిధిన్ పట్టగలిగె
విశ్వభీకరమైన విషవహ్ని నీ జిహ్వ
ఏ ప్రకారమ్ము సహింపగలిగె
విశ్వభీకరమైన విషవహ్ని నీకంఠ
నాళమ్ము లేతీరు తాళగలిగె

పిండి బెల్లాల చేసిన యుండవోలె
పండి మ్రగ్గిన నేరేడు పండువోలె
నోట బెట్టుకొన్నావె! నీ బోటి మహిమ
నీలమణి భూషయయ్యె వర్ణింప తరమె!

## వ్యాఖ్య

శ్రీకంఠా! శివా! సముద్ర మథనవేళ ఉద్భవించిన విశ్వ భయంకర విష జ్వాలలు నీ సుకుమార నేత్రాలు ఎలా వీక్షించగలిగాయి. శంకరా! ఆ విష జ్వాలలను నీ సుందర సుకుమార కరాలు ఎలా తాకి పట్టుకోగలిగాయి. చంద్రశేఖరా! దుర్భరమైన ఆ కాలకూట విషాన్ని నీ నాలుక ఎలా సహించగలిగింది. అదేదో బెల్లపు ఉండవలె నేరేడు పండువలె నోట్లోవేసుకొని చప్పరిస్తున్నావంటే అత్యాశ్చర్యకరంగా ఉంది. నీ మహిమ వర్ణనాతీతం.

నీవు మహాదేవుడవూ, భవానీ పతివీ కనుక ఆ తల్లి సర్వమంగళ మంగళ సూత్ర బలం వలన నీవు ఆ విషాన్ని అలా పుక్కిట పట్టి ఉంచుకోగలిగావు శివా!

మ్రింగెడివాడు విభుండని<br>
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్<br>
మ్రింగుమనె సర్వమంగళ<br>
మంగళసూత్రమ్ము నెంత మది నమ్మినదో — భాగవతం

## 33. భక్త సులభ!

నాలంవా సకృదేవ దేవ భవత స్సేవానతిర్వా నుతిః
పూజావాస్మరణం కథా శ్రవణమప్యాలోకనం మాదృశామ్,
స్వామి న్నస్థిరదేవతానుసరణాయాసేన కిం లభ్యతే
కావా ముక్తిరితః కుతో భవతిచే త్కిం ప్రార్థనీయం తదా

పద్యం

ఒకసారి నీనామ ముచ్చరించిన చాలు
వానికి పాపలవమ్ము లేదు
ఒకమాటు నీగాథ నొకటి విన్నను చాలు
వానికి మృత్యుర్భయమ్ము లేదు
ఒకతేవ నీరూప మూహచేసిన చాలు
వానికిక పునర్భవమ్ము లేదు
ఒకతూరి అభిషేక మొనరించినను చాలు
వానికి జీవ తత్వమ్మె లేదు

ఇందు ఏ ఒక్కటిచ్చినా ఇంతెచాలు
ముక్తి కింకేమి కావలె భక్త సులభ!
ఇతర దైవాల వలన మాకేమి లబ్ధి
సత్యసాయీశ్వరా! మాకు శరణ మీవె!

వ్యాఖ్య

స్వామీ! నీవెంత దయామయుడివి తండ్రీ! నీ నామ మాహాత్మ్యం ఎంత అని ఎవరు గుర్తింపగలరు? ఒక్కసారి నీ నామం ఉచ్చరించిన మాత్రాన ఎట్టి పాపికైనా పాపాలన్నీ పోగొట్టి పరమ పదం ప్రసాదిస్తావు. ఇందుకు అజామీళాదులు సాక్ష్యం.

నీ కథలలో ఒక్కటి శ్రద్ధగా శ్రవణం చేసినా చాలు, ఎట్టి మూఢుడికైనా మోక్షం ఇస్తావు. ఖట్వాంగుడిందు కుదాహరణం.

నీ రూపం ధ్యానించినవాడికి పునర్జన్మ లేకుండా చేస్తావు. ధ్రువుడు, తిన్నడు ఇది తెలియజేస్తాడు. ఒక్కసారి అభిషేకం చేసినా చాలు హస్తిరాజుకు అపవర్గం అందించావు.

పై గుణాలలో ఏ ఒక్కటైనా, నాకు కలిగేలా అనుగ్రహించు స్వామీ! సాయీశా! నాకు నీ చరణాలే శరణాలు!

ఏకో౽పి కృష్ణస్య కృతః ప్రణామః
దశాశ్వమేధావభృథేవ తుల్యమ్
దశాశ్వమేధా పునరేతి జన్మ
కృష్ణ ప్రణామీ నపునర్భవాయ

# 34. వీరమణి

కిం బ్రూమ స్తవసాహసం పశుపతే కస్యాస్తి శంభో భవ
ద్ధైర్యంచే దృశమాత్మనస్స్థితిరియం చాన్యైః కథంలభ్యతే,
భ్రశ్య ద్దేవగణం త్రసన్మునిగణం నశ్య త్ప్రపంచం లయం
పశ్య న్నిర్భయ ఏకఏవ విహరత్యానందసాంద్రోభవాన్

పద్యం

విలయోగ్ర కాలాంత విస్ఫులింగ జ్వాల
దేవతాదులు కాలిపోవుచుండ
ఆత్మసంయమిత మహాసమాధి స్థితు
లగు ఋషుల్ గడగడలాడుచుండ
బ్రహ్మాండ భాండాలు భళ్ళుభళ్ళున దొర్లి
సెగలు పొగలు గ్రక్కి పగులుచుండ
విశ్వమెల్లను మహా భీభత్స రూపాన
హేతిచ్ఛటలతో దహించుచుండ

నీవె ఏకైక మూర్తివి నిబ్బరముగ
వేడ్క విహరింప జాలిన వీరమణివి
నీ మహాసాహస స్థైర్య నిర్భయాల
ఎవరు వర్ణింపగలరు సాయీ మహేశ!

## వ్యాఖ్య

శివా! రుద్రా! నీ వెంత ధైర్యశాలివి, వీరాధివీరుడవయ్యా! ప్రళయకాలం వచ్చి లోకాలు భస్మమయ్యే విస్ఫులింగ జ్వాలాకీలలు రేగి అందు దేవాదులు పడి మలమలమాడి మసి అయిపోతుంటే- ఆ విలయ జ్వాలలు చూచి మహాసంయమీంద్రులు సైతం ధైర్యం కోలుపోయి సమాధి స్థితి వీడి గడగడ వణికిపోతూంటే-బ్రహ్మాండాలు ఖాండాలవరె దొర్లి భగభగమండి అగ్నిగోళాలై ఫతేలున పగిలి విచ్చిపోతుంటే- ఆ ప్రళయాగ్ని శిఖలలో విశ్వమంతా భస్మమైపోతూంటే- అమరాధినాథులు హడలిపోయి ప్రాణాలు చేతిలో పట్టుకొని పరుగు పెడుతుంటే-

నీవు ఒక్కడివి మాత్రం మహాధైర్యంగా నిర్భయంగా వీరవిహారం చేయసాగావు. నీ సాహసం, నీ ధైర్యం, నీ స్థైర్యం, నీ శౌర్యం ఎవరు ఎంత అని వర్ణించగలరు? నీకిదే నమోవాకాలు.

శివుడు అష్టమూర్తి. ఆదిమధ్యాంతరహితుడు- భేద దృష్టిలేనివాడు. భేద దర్శికి భయంకాని సమదర్శికి భయం కలుగదు. పరమేశ్వరుడు పరమ అద్వైత మూర్తి-

"ద్వితీయాద్వై భయం భవతి"

## 35. ఆత్మబంధు

యోగక్షేమ ధురంధరస్య సకల శ్రేయః ప్రదోద్యోగినో
దృష్టాదృష్ట మతోపదేశ కృతినో బాహ్యాంతరవ్యాపినః,
సర్వజ్ఞస్య దయాకరస్య భవతః కిం వేదితవ్యం మయా
శంభోత్వం పరమాంతరంగ ఇతిమే చిత్తే స్మరామ్యన్వహమ్

పద్యం

మా యోగ సంక్షేమ మహిత భారంబెల్ల
దయతోడ బూనిన దండ్రి వీవు
సకల శ్రేయస్కర సంపద లందింప
త్వరపడు చల్లని తల్లి వీవు
ఐహికాముష్మిక కాహ్లాద ప్రబోధాలు
కూర్మితో అందించు గురుడ వీవు
అవ్యేప భూమి బాహ్యాభ్యంతరములందు
వ్యాప్తిజెందిన పరమాత్మ వీవు

స్వామి! సర్వజ్ఞ! కారుణ్యజలధి! నిన్ను
గూర్చి ఇంక ఏమి తెలిసికోగలాడ!
అస్మదాత్మీయ బంధు! నిన్ననవరతము
హృదయపీఠిపై నిల్పి స్మరించుకొందు

## వ్యాఖ్య

శివా! పరమపితా! నీవు మా యోగక్షేమాలు ప్రతినిత్యం పరిశీలిస్తుంటావు. మా తండ్రివి కదా! పుత్రుల యోగక్షేమాలు నీవు చూచుకోవలసిందే.

నీ హృదయం మహిత మంగళ మాతృ హృదయం. మాకు సర్వ శ్రేయస్సులు త్వరత్వరగా కలగాలని అందుకు కావలసిన అవకాశాలన్నీ అందిస్తుంటావు. వేయి తల్లుల ప్రేమకదా నీది. మా తల్లివి నీవు.

మాకు గురువువై ఐహిక ఆముష్మికాలకు నిత్యానందకర ప్రబోధాలు నిత్యం బోధిస్తుంటావు. జగద్గురువై మా అజ్ఞానం దూరం చేస్తుంటావు.

నీవు మాకు తండ్రివి, తల్లివి, గురువువు మాత్రమే కాదు. ఘానకోంత రాశాలు వ్యాపించి సర్వత్ర నిండి నిలిచిన పరమాత్మవు నీవు. నీవు అనంత ప్రేమమయ మూర్తివి. సర్వజ్ఞుడవు. కల్యాణ కారుణ్య సాగరానివి. నిన్ను గూర్చి నాకేమి తెలుసు.

నీవు నాకు అత్యంత ఆత్మీయ బంధువువి. నా సర్వస్వం నీవే. నన్ను అనుక్షణం నడిపేది నీవే అని తెలుసుకొన్నాను. నా హృదిలో నిన్ను నిలిపి అర్చిస్తుంటాను.

త్వమేవ మాతాచ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ గురుస్త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ!

# 36. పుణ్యాహవాచనం

భక్తో భక్తిగుణావృతే ముదమృతా పూర్ణే ప్రసన్నే మనః
కుంభే సాంబ తవాంఘ్రి పల్లవ యుగం సంస్థాప్య సంవిత్ఫలమ్,
సత్త్వం మంత్రముదీరయన్ నిజశరీరాగార శుద్ధిం వహన్
పుణ్యాహం ప్రకటీకరోమి రుచిరం కళ్యాణ మాపాదయన్

పద్యం

దేహము స్వగృహముదేవ! పుణ్యాహ వా
 చనమున కభ్యనుజ్ఞను ఒసంగు
స్వచ్ఛ హృదయకలశమునిండ సంతోష
 సలిలమ్ము నింపితి శర్మదాయి!
భవదీయ పాదపల్లవము అలంకరిం
 చితి- కలశమ్ముపై -శివ విధాయి!
బత్తి దారము చుట్టి పరమ విజ్ఞానంపు
 నారికేళము నిల్పినాను సాయి!

సత్త్వ శివసుందరానంత శాంతి మంత్ర
ముచ్చరించుచున్నాను- లోకోపకార
సర్వమంగళ జగదేక సార్వభౌమ!
పరమ వరదాత! ఆశ్రిత పారిజాత!

## వ్యాఖ్య

పరమ వరదాతా! సాయీశ్వరా! ఈ దేహం నా గృహం. నా గృహంలో ఆత్మకళ్యాణోత్సవం జరపాలనుకున్నాను- అందుకై ముందుగా పుణ్యాహవాచనం చేస్తున్నాను. దానికి నీ అనుమతి ఈయవలసినది.

హృదయం అనే కలశం కడిగి శుభ్రపరచాను. దానినిండా సంతోషం అనే జలం పోశాను. సాయీ! సౌఖ్యదాయీ! ఆ కలశానికి నీ పాదపల్లవాలు అనే మామిడి చిగుళ్ళ అలంకరించాను. భక్తి అనే పసుపుదారం చుట్టి కలశంపై విజ్ఞానం అనే నారికేళం నిలబెట్టాను.

మంగళ ద్రవ్యాలతో ఇలా హృదయ కలశాన్ని అలంకరించి సత్త్వమూ, శివంకరమూ, సుందరతరమూ, సర్వమంగళతమమూ అయిన శాంతి సూక్తం పఠిస్తున్నాను. నా గృహం పరిశుద్ధమూ, పరమ మంగళప్రదమూ, కల్యాణ ప్రదమూ అయేలాగా కటాక్షించు కమలాపతీ! ఆశ్రిత మందార! జగదేక సార్వభౌమా!

సాయీశ్వరా! నాయీ మంగళాకాంక్ష నెరవేర్చు స్వామీ! నిన్ను ధ్యానిస్తున్నాను. నీ నామం జపిస్తున్నాను.

"యజ్ఞానాం జప యజ్ఞోస్మి"

# 37. మనస్సు సాగరమథనం

ఆమ్నాయాంబుధి మాదరేణ సుమనస్సంఘాస్సముద్యన్మనో
మంథానం దృఢభక్తిరజ్జుసహితం కృత్వామథిత్వా తతః,
సోమం కల్పతరుం సుపర్వసురభిం చింతామణిం ధీమతాం
నిత్యానందసుధాం నిరంతర రమాసౌభాగ్య మాతన్వతే

పద్యం

సుమనోగణ మ్మాదరముతోడ వేద వా
        ర్థిని ప్రయత్నమున మథింపసాగి
మహిత మానస మహా మందర శైలమున్
        భక్తి వాసుకి చేతపట్టి చుట్టి
ఇష్టదైవమ్ము ఉపేంద్రుని కూర్మావ
        తారమెత్తుమని ప్రార్థనమొనర్చి
దైవబలంబను ధనము సంపాదించి
        చిరతపస్సు ఫలింపచేసికొనియు
సోమరసమును సంజీవనామృతమును
కామధేనువు పండిన కల్పతరువు
పరమ సుందరానంద సౌభాగ్యలక్ష్మి
నందుకొన్నది శివ! నీ దయాలవమ్ము!

## వ్యాఖ్య

శివా! నా మనస్సు మధుర భక్తి కోరి మథన చేయటం మొదలు పెట్టింది. మనస్సే మందరపర్వతమయింది. దానికి భక్తి అనే వాసుకిని చుట్టి పట్టాను. అది మునిగిపోతుంటే ఇష్టదైవమైన ఉపేంద్రుణ్ణి స్మరించాను. ఆస్వామి కూర్మావతారుడై వచ్చి మందరం క్రింద నిలిచి మథన కార్యక్రమానికి సహాయం చేశాడు. నీదైనబలం పురుషప్రయత్నం కలిసివచ్చి పుణ్యం ఫలించి నా తపస్సు వండి సముద్రంనుండి చాలా శుభంకరవస్తువులు లభించాయి సాయీ!

సోమరసం అనే సంజీవినీ అమృతం, కామధేనువు, కల్పవృక్షం, మోక్షలక్ష్మి సంప్రాప్తమైనాయి. ఇది అంతా కూడ నీకరుణాకటాక్షం వల్లనే జరిగింది. ఈ ప్రేరణ కారణం అన్నీ నీవేకదా! నీదయాలవం లభిస్తేచాలు సర్వసంపదలు లభ్యమవుతాయి.

## 38. చంద్రుడు - చంద్రమౌళి

ప్రాక్పుణ్యాచల మార్గదర్శిత సుధామూర్తిః ప్రసన్నశ్శివ
స్సోమస్సద్గణసేవితో మృగధరః పూర్ణస్తమోమోచకః,
చేతఃపుష్కరలక్షితో భవతి చే దానంద పాథోనిధిః
ప్రాగల్భ్యేన విజృంభతే సుమనసాం వృత్తి స్తదాజాయతే

పద్యం

అమృతమయంబైన ఆకృతిగలవాడు
నిరుపమానంబైన నిర్మలుండు
శిష్టచక్రమ్ముచే సేవింపబడువాడు
షోడశ కళలతో చూచువాడు
హస్తపద్మములోన హరిణమ్ము గలవాడు
చీకట్ల యిక్కట్లు చీల్చువాడు
దివిజులకెల్లను తీపిబోనమువాడు
మానస క్లేశముల్ మాన్పువాడు

హృదయగగనాన జ్యోతి వెల్గించుకొనుచు
పూర్వపుణ్యశైలమ్ముపై పొడిచినాడు
చంద్రమౌళియన్ చల్లని చందురుండు
సజ్జనానంద వార్ధి కుత్సవము కాగ.

## వ్యాఖ్య

శివా! చంద్రమౌళీశ్వరా! నీకు చంద్రునికి అనేక సామ్యాలున్నాయి. మీకు అభేదమేకదా! చంద్రుడు అమృతమూర్తి. తూర్పు పర్వతంపై ఉదయిస్తుంటాడు. వెన్నెలలు జాలువార్చి మనస్సున కానందము కలుగజేస్తాడు. శశిని తారాగణం సేవిస్తుంటుంది. ఆయన హరిణాంకుడై షోడశ కళాప్రపూర్ణుడై శోభిల్లుతుంటాడు.

శివా! నీవు మృతిలేని అమృతమూర్తివి. సుధామూర్తిపై విభూతి సౌందర్యంతో ధవళ తేజస్సుతో విరాజిల్లుతుంటావు. నీవూ కైలాసాద్రిపై వెలుగుతుంటావు. కరుణాకటాక్షాలనే అమృత శీతల కాంతులు ప్రసారంచేస్తుంటావు. నిన్ను నిత్యం ప్రమథగణం సేవిస్తుంటూంది. నీ చేతిలో కూడ హరిణం అందం చిందుతుంటుంది. నీవు అజ్ఞానం అనే అంధకారాన్ని దూరం చేస్తావు.

చంద్రుణ్ణి చూచిన సముద్రం పొంగినట్లు నిన్ను చూడగానే జనహృదయం ఉప్పొంగిపోతుంటుంది. చంద్రుని చంద్రికలు దేవతలకు భోజనమైతే నీ దర్శన కాంతులు జగత్తుకు ముక్తి భోజనం. మహాకాశంపై చంద్రునివలె మా చిదాకాశంపై నీవు ప్రకాశిస్తుంటావు. దేవా! నాకు నీ దర్శన భాగ్యం కల్గజేసి శివానందలహరిలో ఓలలాడించు సాయీశ్వరా!

## 39. శివరాజమౌళి

ధర్మో మే చతురంఘ్రికః సుచరితః పాపం వినాశం గతం
కామక్రోధమదాదయో విగళితాః కాలాస్సుఖావిష్కృతాః,
జ్ఞానానంద మహౌషధి స్సుఫలితా కైవల్య నాథే సదా
మాన్యే మానస పుండరీకనగరే రాజావతంసే స్థితే

పద్యం

పంచముక్తులలోన పరమోన్నతంబైన
పదవి నందించు కైవల్య విభుడు
బ్రహ్మాండములనేలు ప్రభువర్గమందలి
మహనీయ మూర్తుల మాన్యతముడు
తలచిన మాత్రాన దయజూచి రక్షించు
ఇలవేల్పు సత్యసాయీశ్వరుండు
ఎల్ల సస్యములిచ్చి చల్లని చూపుల
ప్రజలను పాలించు రాజమౌళి

నా మనః పద్మ రాజ్యాసనమున నుండ
ధర్మదేవత నాల్గు పాదాల నడచె
పాపము నశించె కామాది వైరులణగె
జ్ఞానము ఫలించె ఆత్మ ప్రశాంతి జెందె.

## వ్యాఖ్య

శివరాజమౌళీ! రాజశేఖరా! నీవు నా హృదయ సింహాసనం అధిష్ఠించి మేలుగా రాజ్యం ఏలుకోస్వామీ! నీవు రాజనీతి చతురుడవుకదా!

పంచముక్తులలో చివరిదైన కైవల్యం ప్రసాదించగల సమర్థుడవు నీ వొక్కడవే. బ్రహ్మాండాలు పాలించగల నేర్పు నీకు మాత్రమే ఉన్నది. నీవు రాజువు కాగానే ధర్మ నాల్గుపాదాల నడుస్తుంది. ప్రజారంజకుడవై అందరికి ఇల వేల్పువై భక్త సులభుడవై తలచినంతనే వచ్చి కాపాడే కరుణా సముద్రుడవు.

నీవు కామాది దుర్గుణాంధకారాలు దూరంచేసే చంద్రుని వంటివాడవు. నీ పాలనలో సర్వ ఓషధులు, సస్యములు ఫలిస్తాయి. భక్తులకు కైవల్యం ప్రసాదించే దయాళూ! నా అజ్ఞానం పోగొట్టి నా దుర్గుణాలు దూరంచేసి జ్ఞానానంద చంద్రికలు నా మనోరాజ్యం నిండేలా చేయి ప్రభూ! నీకు సర్వోపచారాలు చేస్తుంటాను.

తత్ర శ్రీ ర్విజయో భూతిః

ధ్రువానీతిః—

## 40. ఏతాము

దీయంత్రేణ వచోఘటేన కవితాకుల్యోప కుల్యాక్రమై
రానీతైశ్చ సదాశివస్య చరితాంభోరాశి దివ్యామృతైః,
హృత్కేదారయుతాశ్చభక్తికలమా స్సాఫల్య మాతన్వతే
దుర్భిక్షన్మమ సేవకస్య భగవ న్విశ్వేశ భీతిఃకుతః

పద్యం

బుద్ధిని మలచి అపూర్వమైనట్టి ఏ
 తాము చేసితి పార్వతీ మనోజ!
స్వచ్ఛ వచస్సులన్ సరిదిద్ది తీర్చితి
 భాండాలు రెండు ఓ ప్రణవమూర్తి!
కావ్యకళా సుప్రకాశిత కవితను
 పంటకాలువగ ఏర్పరచితీశ!
ఛందో విధానాలు చక్కనొనర్చితి
 పిల్ల కాల్వలుగ రాజిల్ల దేవ!

నీ కథాప్రవాహమునుండి నీరుతోడి
నా మనః క్షేత్రమున రాజనాలు భక్తి
పంట పడించుకొందు నా బ్రతుకు నిండ
కరువు తీరగా సాయీ! ప్రకాష్యదాయి!

## వ్యాఖ్య

ప్రణవమూర్తీ! పార్వతీపతీ! నా బుద్ధిని ఏతాముగా ఏర్పాటు చేశాను. మంచి సూక్తులు అనే రెండు బుంగలను ఏతాముకు కట్టాను. కవిత అనే పంట కాలువను త్రవ్వాను. దానిలోనుండి ఛందో విధానాలు అనే పిల్లకాలువలను మొక్కలలోనికి బోదెలు తీశాను. 

ఇక నీ కథా ప్రవాహం నుండి ఏతాము వేసి నీరు తోడటం మొదలుపెట్టాను. నా మనస్సు అనే పొలం బాగా తడిపి సాగుచేయసాగాను. భక్తి అనే వరినారు నాటి రాజనాల పంట పండిస్తున్నాను స్వామీ! 

నా పంట పండింది. నా కరువు తీరిపోయింది. బ్రతుకు బంగారం అయింది. నీ కటాక్షామృతం లభిస్తే ఇంక నాకు కావలసినది ఏమున్నది స్వామీ! నీ పదభక్తి యొక్క శక్తి అనంతం కదా! 

ఇందులోని రూపకాలంకారం రమణీయం, భక్తిరసంతో హృదయం ఆర్ద్రమైనప్పుడు జ్ఞానఫలాలు లభిస్తాయి.

'స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారః' —నారద సూత్రాలు

# 41. ఇంద్రియాలు

పాపోత్పాత విమోచనాయ రుచిరైశ్వర్యాయ మృత్యుంజయ
స్తోత్రధ్యాన నతిప్రదక్షిణ సపర్యాలోకనాకర్ణనే,
జిహ్వాచిత్తశిరోఽంఘ్రి హస్త నయనశ్రోత్రైరహం ప్రార్థితో
మామాజ్ఞాపయ తన్నిరూపయ ముహుర్మామేవ మా మేవచః

పద్యం

"సత్యసాయిని వల్కాశాసింపు" మను నాల్క
'హరిని ధ్యానింతురా' అను మనస్సు
"శ్రీ పాదముల మ్రొక్క" శీర్షమ్ము త్వరపడు
'సాయి సందర్శనం' బనును కనులు
"పూజకై మమ్ము పంపు" మను హస్తమ్ములు
'గుడిప్రదక్షిణసేయ' కోరుకాళ్ళు
"పూజించిన సుమాలు మూర్కొందు" నను ముక్కు
'హరికథలను విందు'మనును శ్రుతులు

ఇట్లు బ్రతిమాలుచున్నవి ఇంద్రియాలు
అఘహరమ్ములు పుణ్యదా లంచు సతము
దేవ! కర్తవ్యమేమొ! ఆదేశమిమ్ము
నాది ఏమున్నదయ్య దేవాధిదేవ!

వ్యాఖ్య

ఐశ్వర్యప్రదాయకా! మృత్యుంజయా! సదాశివా! దేవాధిదేవా! నా యింద్రియాల విన్నపాలు విన్నవిస్తాను. నీవు ఏమి ఆజ్ఞాపిస్తే అలా చేస్తాను. నాకు స్వతంత్ర నిర్ణయమేమిటి? నీ దాసదాసుడనుకదా!

నా నాలుక- సత్యసాయీశ్వరుని స్మరిస్తాను అలా నన్ను శాసించు అంటుంది. మనస్సు- హరిని ధ్యానిస్తాను అంటుంది. శీర్షం శ్రీవారి పాదపద్మాల వద్ద మోకరిల్లుతాను అంటుంది. కనులు- సాయీ సందర్శనం చేసుకొంటాను అంటాయి. హస్తాలు పూజలు చేస్తాము పంపించమంటాయి. కాళ్ళు గుడి ప్రదక్షిణం చేసివస్తాము అంటాయి. నాసిక పూజానిర్మాల్యం ఆఘ్రాణిస్తాను అంటుంది. చెవులు శ్రీహరి కథాశ్రవణం చేస్తాము అంటాయి.

నీవేమి ఆజ్ఞాపిస్తే అలా చేస్తాను అంటాడు భక్తసత్తముడు. కర్తృత్వం జీవుడు వహించరాదు. దేవునిది కర్తృత్వం. జీవుని ఇంద్రియాలు సన్మార్గం అపేక్షించి జీవుణ్ణి అర్థించటం చమత్కారం.

'ధియోయోనః ప్రచోదయాత్'

# 42. మనోదుర్గము

గాంభీర్యం పరిఖాపదం ఘనధృతిః ప్రాకార ఉద్యద్గుణ
స్తోమశ్చాప్తబలం ఘనేంద్రియచయోద్వారాణి దేహస్థితః,
విద్యా వస్తుసమృద్ధి రిత్యఖిల సామగ్రీ సమేతే సదా
దుర్గాతిప్రియ దేవ మామక మనోదుర్గే నివాసం కురు

పద్యం

దుర్గామిత్రప్రియా! దుర్గమ్ము నా హృది
రాజమౌళీ! వేగిరమ్ము రమ్ము
గంగాధర! అగడ్త గాంభీర్య మన్నది
ప్రాకారమా! ధైర్య బలము గలది
గుణ సమూహము చమూగణ మతివిశ్వాస
పాత్రమ్ము అతి సచ్చరిత్రగలది
దృఢమైనవయ్యా నా ఇంద్రియ ద్వారాలు
విద్య సమృద్ధిగా వృద్ధిపొందె

వివిధ వస్త్రాయుధమ్ములు పెక్కుదేవ!
అన్ని హంగులు గల దుర్గమది మహేశ!
ఇందు దుర్గతో నివసింపు మిందుమౌళి!
సకల రాజోపచారముల్ జరుపగలను.

వ్యాఖ్య

సాంబా! సోమా! సాయీ! నీకు దుర్గ అంటే దుర్గము అంటే చాలా ఇష్టం. అందుకని నిన్ను 'దుర్గాతి ప్రియా' అనడం నాకు నచ్చిన విషయం.

నీవు దుర్గాతి ప్రియుడవు కనుక నా మనస్సు కనకదుర్గముగా తీర్చిదిద్దాను. అరిషడ్వర్గాలకు నా మనస్సు దుర్గమ ప్రదేశం. అందులో నీవు నీ దుర్గతో వచ్చి నివాసం చేయి. నా మనోదుర్గం నీ నివాసానికి చాలా యోగ్యంగా ఉంటుంది. ఇది శత్రు దుర్భేద్యం, బలిష్ఠమైనది.

నా దుర్గానికి చుట్టూ గంభీరగుణం అనే పెద్ద అగడ్త ఉన్నది. ధైర్యం అనే మహోన్నతమైన ప్రాకారం ఉన్నది. సుగుణ సమూహాలు అనే సేనా వ్యూహాలు పెక్కున్నాయి. ఆ సేన మిక్కిలి విశ్వాసపాత్రమైనది. అంతేకాదు. సచ్చరిత్రగలది.

నా యింద్రియ ద్వారాలు వజ్రకవాటాలు గలవి. శ్రీ విద్య అనే ఆధ్యాత్మిక విద్యా ధనం మిక్కిలిగా ఖజానాలో ఉన్నది. వివిధ వస్తువులు, ఆయుధాలు పెక్కులు. ఈ దుర్గం అన్ని హంగులూ, అన్ని వసతులూ ఉండి నీకు అన్నివిధాల యోగ్యంగా ఉన్నది. దీనిలో నివసించు స్వామీ! సకలోపచారాలతో మిమ్మ సేవించుకొంటాము. సేవావకాశం ఒకసారి ఇచ్చిచూడు దేవా! నా దగ్గర నీవు ఉంటే అన్నీ ఉన్నట్లే—

రూప మారోగ్య మర్థాంశ్చ
భోగాంశ్చై వానుషంగికాన్
దదాతి ధ్యాయతో నిత్య
మపవర్గ ప్రదో హరిః

—విష్ణుసహస్ర భాష్యం

## 43. మనమువనము

మా గచ్ఛ త్వమిత స్తతో గిరిశ భో మయ్యేవవాసం కురు
స్వామిన్నాదికిరాత మామక మనఃకాంతారసీమాంతరే,
వర్తంతే బహుశో మృగా మదజుషో మాత్సర్యమోహాదయ
స్తాన్హత్వా మృగయావినోదరుచితా లాభంచసంప్రాప్స్యసి

పద్యం

మృగయా వినోదమ్ము ఇష్టకార్యముకదా
మయాకిరాత! వేంచేయవయ్య!
నా జీవనమె గహన వనమ్మిచట లోభ
కామాది మత్త మృగములు పెక్కు
సద్వృత్తి ఫలవృక్ష సమితి కేదారాలు
నాశమ్ము చేయుచున్నవి పినాకి!
ఒకసారి దయచేసి ఇక బాధలేకుండ
చేయవే ఇదె నమస్కృతి యొనర్తు.
నీకు మోజుతీరును వంట నిలుచునాకు
స్థిరముగా నుండవచ్చును దేవ దేవ
ఇందె గిరిపుత్రితో విహరింపవచ్చు
అభ్రపదదాత! లోకన్యాయాధినేత!

## వ్యాఖ్య

మృత్యుంజయా! మృగయా ప్రియా! మాయా భిల్లుడివేషం అంటే నీకు చాలా ఇష్టం. వేట తమకం అధికం నీకు. ఒకసారి బ్రహ్మ అక్రమ కామ కలాపానికి ఆడపిల్ల సరస్వతి భయపడి లేడిపిల్లయై పరుగెత్తసాగింది. బ్రహ్మ జింకయై వెంటపట్టాడు. నీవు ఇది అన్యాయం అని సహించలేక వేటగాడివై జింకను వారించి లేడిని చేతిలోకి తీసుకున్నావు. మరొకసారి పాశుపతాస్త్రప్రదాన సందర్భంలో అర్జునుని పరీక్షించటానికి మాయాభిల్లుడివై పందికై పోరాడసాగావు.

నా జీవనం పెద్దవనం. దీనిలో కామ మద మోహ లోభాలనే క్రూర మృగాలు విహరిస్తున్నాయి. సద్వృత్తి సుగుణాలు అనే పంటపొలాలలో పడి భక్తి అనే పంటను నాశనం చేస్తున్నాయి. స్వామీ! ఒక్కసారి వచ్చి ఈ మృగాలను వేటాడి నాకు భక్తి పంట సుగుణ ఫలాలు చేతికి అందేలా చూడవలసింది.

దీనివలన రెండు లాభాలు. నీకు వేట మోజుతీరుతుంది. నాకు పంట చేతికి వస్తుంది. గిరిపుత్రితో వచ్చి ఇక్కడే ఉండిపో స్వామీ!

"మృగయుభ్య శ్శ్వనిభ్యశ్చవో నమోనమః"

## 44. మహాదేవసింహ

కరలగ్న మృగః కరీంద్ర భంగో
ఘనశార్దూల విఖండనోఽ స్తజంతుః,
గిరిశో విశదాకృతిశ్చ చేతః
కుహరే పంచముఖోఽ స్తి మే కుతో భీః

పద్యం

హరిణమ్ము కరమున అలరుచుండిన హరా!
గజదైత్యు జంపిన ఘన పినాకి!
దుర్గమ వ్యాఘ్రమ్ము తోలు తీసిన శూలి!
నత్త్వ సంహారమ్ము సలుపు ప్రోడ!
ఉన్నతోన్నత పర్వతోపరి సంచార!
రజతాద్రి సదృశ విరాజితాంగ!
బలిశౌర్య సుందర ప్రకటిత పంచాస్య
లలిత సౌందర్య కైలాసవాస!

దేవసింహమ్ము నీవు ఓ దేవ దేవ!
అస్మదీయ హృదయ గుహాయందు నీవు
సర్వసౌఖ్యమ్ముగా నివాసమ్ము సేయ
నాకు ధైర్యము కలుగు! శివా కపర్ది!

## వ్యాఖ్య

మహాదేవదేవా! నీవు దైవములలో సింహంవంటి వాడవయ్యా! నా హృదయం గుహవంటిది. ఆ గుహలో సింహం వంటి నీవు ఉంటే నాకు క్షేమం. నాకు నిర్భయం. మృగరాజు నా హృదయంలో ఉండి నా జీవన వనం పాలిస్తుంటే నాకేమికావాలి. ఇతర క్షుద్రమృగాలవల్ల భయం ఉండదు.

శివా! నీకూ సింహానికి చాలా పోలికలున్నాయి. హరిణం అంటే నీకూ సింహానికీ ఇష్టం. నీవు గజాసురుణ్ణి చంపి చర్మం ధరించావు. సింహం కూడ గజాన్ని సంహరిస్తుంది. వ్యాఘ్రాసురుణ్ణి చంపి నీవు సింహ సమానమైనావు. నీవు గిరీశుడవు. సింహమూ గిరి సంచారియే కదా! వన పర్వత సంచారంలో ఇరువురూ ఆరితేరినవారే. నీవు తెల్లగా ఉంటావు, సింహరాజం కూడా తెల్లగా ఉంటుంది. బలశౌర్యాలు ఇరువురివి అద్వితీయాలు. దేవా! నీకు పంచాస్యుడు అనే పేరు ఉంది. 1) సద్యోజాత ముఖం 2) వామదేవ ముఖం 3) అఘోర ముఖం 4) తత్పురుష ముఖం 5) ఈశాన ముఖం. సింహానికి పంచాస్యం. పెద్దదైన ముఖము గలది అని పేరుంది. ఓ శివా నాపై కరుణ వహించి నా హృదయంలో నివసించి నన్నుద్ధరించవలసినదని ప్రార్థన.

"నభయం క్వచిదాప్నోతి"

## 45. మనః కల్పకం

ఛందశ్శాఖి శిఖాన్వితై ర్ద్విజవరై స్సంసేవితే శాశ్వతే
సౌఖ్యాపాదిని ఖేదిభేదిని సుధాసారైః ఫలై ర్దీపితే,
చేతః పక్షిశిఖామణే త్యజ వృథాసంచార మన్యైరలం
నిత్యం శంకర పాదపద్మయుగళీనీడే విహారం కురు

పద్యం

వేద సంహిత కల్పవృక్ష శేఖర మది
శాఖోపశాఖా ప్రచాలితమ్ము
కమనీయ ఫలసంఘ మమృత సంభరితమ్ము
చిరము ద్విజవర సంసేవితమ్ము
దుర్మద దుర్మోహ దుఃఖ నిర్ఘాతమ్ము
సంతత సంతోష సౌఖ్యదమ్ము
నవజీవనానంద పవన ప్రవృద్ధమ్ము
సుగుణ సుందర సుమశోభితమ్ము
హేమనః పక్షిరాజమా! మామకోక్తి
విని వృథావృథా సంచారమును త్యజించి
నీలకంఠ పదాంబుజ నీడమందు
వాస మొనరింపుమా! అపవర్గ మబ్బు

## వ్యాఖ్య

ఓ మానసపక్షిరాజమా! ఒకమాట చెప్తాను విను. ఇక్కడ ఒక వృక్షం ఉంది చూడు. ఇది వేదకల్పవృక్షం. దీనికి ఉపనిషత్తులు అనే శాఖలు అనేకం విస్తరించినాయి. ఇది అనేక అమృత ఫలాలనిస్తుంది. ఈ చెట్టుపై అనేక ద్విజ సమూహాలు నివాసం చేస్తూ ఈ వృక్ష ఛాయలో సుఖజీవనం చేస్తున్నాయి.

మద మోహ మాత్సర్య లోభాలు ఇచట ఉండవు. ఇక్కడ చల్లని మంజుల మారుతాలు వీస్తుంటాయి. అందాలపూలు పరీమళాలు విరజిమ్ముతూ దూరదూర భ్రమరరాజాలను ఆకర్షిస్తుంటాయి.

ఓ మనః పక్షీ! అటూ ఇటూ వృథాగా పరువెత్తబోకు. దీనిపై శివంకర మైన చక్కని గూడు కట్టుకో. ఆ గూటిలో సుఖవాసం చేయి. సాయి చేయి అందిస్తాడు. ఇతర దురాశామోహాలతో వృథా ప్రయాసలు పడబోకు. వేద శాఖ లలో అమృత ఫలాలు ఆరగించు. నీలకంఠ స్వామి పాద నీడంలో నివాసం చేస్తే అపవర్గ సుఖాలు నీకు నిశ్చయంగా లభిస్తాయి.

మచ్చిత్త స్సర్వ దుర్గాణి
మత్ ప్రసాదా త్తరిష్యతి

## 46. మానసరాజహంస

ఆకీర్ణే నఖరాజికాంతివిభవై రుద్యత్సుధా వైభవై
రాధౌతేఽపిచ పద్మరాగలలితే హంసవ్రజై రాశ్రితే,
నిత్యం భక్తివధూగణైశ్చ రహసి స్వేచ్ఛావిహారం కురు
స్థిత్వా మానసరాజహంస గిరిజానాథాంఘ్రి సౌధాంతరే

### పద్యం

నవరత్నమణులట్లు నఖరాజరుచులెల్ల
 దేదీప్యమానమై దిశల ప్రాక
కల్పాంత రోదిత గంగామృత స్నాత
 జనిత సుధా ప్రకాశములు నిండ
పరమసుందర జాతి పద్మరాగ ప్రభా
 జిత రత్నకాంతి రంజితముకాగ
సదసద్వివేక విజ్ఞాన మేధాపూర్ణ
 పరమహంసములు సేవల నొనర్ప
వెలుగు శివమూర్తి పాదారవింద రాగ
రమ్య సౌధాంతర సరోవరమ్ములందు
భక్తిరూపలౌ భార్య లుపచరింప
మానస మరాళ! విహరింపుమా సుఖాన!

వ్యాఖ్య

ఓ మానస రాజహంసమా! ఇక్కడ ఒక అందమైన సరోవరం ఉంది. ఇది చాలా మహిమాన్వితం. ఒకసారి చూస్తే విడిచిపెట్టవు. ఇందులో విహరించు. నీకు శ్రేయస్సు యశస్సు కల్గుతాయి. రాజహంసలు అభిలషించే ముత్తెపుచిప్ప లున్నాయి. 'హంసగోరులు' అని వానికి పేరు. అవి నవరత్నాలవలె మెరుగులీను తుంటాయి. ఆకాశ గంగా సుధాస్రవంతీప్రవాహాలు నిత్యం జాలువారుతుంటాయి. పద్మరాగాల ప్రవాళాలు ఇక్కడ వేలాదివేలు. విజ్ఞాన వికచారవిందాలు మూచూస్తూ పరమహంసలు ఇందే విహారం చేస్తుంటాయి.

పరమేశ్వరుని పాదమనే సౌధం లోపల గల ఈ సరోవరానికి వెళ్ళి భక్తి అనే సాధ్వీమణులతో విహరించు. ఓ మానసమరాళమా! అల్పమైన వాగులకు వంకలకు పోనేల!

నిర్మల మందాకినీ వీచికల దూగు
రాయంచ జనునె తరంగిణులకు -భాగవతము

# 47. మానసోద్యానం

శంభుధ్యాన వసంతసంగిని హృదారామేఽఘజీర్ణచ్ఛదా
స్రస్తా భక్తిలతాచ్ఛటావిలసితాః పుణ్యప్రవాళశ్రితాః,
దీప్యంతే గుణకోరకా జపవచః పుష్పాణి సద్వాసనాః
జ్ఞానానందసుధామరందలహరీ సంవిత్ఫలాభ్యున్నతిః

పద్యం

స్మరణ వసంతమ్ము అరుదెంచినది స్వామి!
కలుషపత్రము ఎండి రాలిపోయె
భక్తిలతలుసాగి పందిరి కెగప్రాకె
పుణ్యపల్లవరాజి పొడమసాగె
మోజుగా సుగుణాలు మొగ్గలు తొడిగెను
జపతపమ్ములను పుష్పములువిచ్చె
సంస్కార పరిమళచక్రమ్ము వ్యాపించె
జ్ఞానసారంపు పూదేనె కురిసె

సంవిదనుభవ ఫలము హస్తమున కందె
సత్యశివసుందరానంద నిత్యపురుష!
భవ్య భవదీయ సత్కృపా బలముచేత
మానసారామమున ఉదయాన జూడ.

## వ్యాఖ్య

స్వామీ! ఇది నామానసోద్యాన సందనవనం. ఇది వసంతారామం. ఇది చైత్రరథం.

మధుమాసం మధుర మంజుల మందానిలాలతో వచ్చింది. సంస్మరణమనే వసంత కాంత తొంగి చూచింది. పాపాలు అనే ఎండుటాకులు రాలిపోసాగాయి. భక్తి లతలు నవవిధాలుగా సాగి పందిరికి ఎగ్రాకుతున్నాయి. పుణ్యాలు అనే చివురుటాకులు పల్లవించాయి. సుగుణాలు మొగ్గలుతొడిగాయి. జపతపాలు అనే పూవులు విచ్చుకోసాగాయి. సంస్కారంఅనే పరిమళం వనమంతా వ్యాపించింది. జ్ఞానసారం అనే మధుర మకరందం పొంగి పొరలసాగింది. అనుభవానందాలు అనే ఫలాలు పండి చేతికందుతున్నాయి.

ఈ దృశ్యం ఈ ఆరామశోభ ఈమహోదయాన దర్శించాను. ఇది అంతా నీ కృపాప్రసాదం ప్రభూ! సత్యశివసుందరానంద మూర్తి! సాయీశ్వరా! శంకరా! శంభూ! నీ విభూతి నాయీ అనుభూతి శాశ్వత మగు గాక!

సమాధి సిద్ధి రీశ్వర ప్రణిధానాత్ -పతంజలి

## 48. మానస సరోవరం

నిత్యానందరసాలయం సురముని స్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛం సద్ద్విజసేవితం కలుషహృ త్సద్వాసనావిష్కృతమ్,
శంభుధ్యాన సరోవరం వ్రజ మనోహంసావతంస స్థిరం
కిం క్షుద్రాశ్రయపల్వల భ్రమణ సంజాతశ్రమం ప్రాప్స్యసి

పద్యం

శాశ్వత సుఖసార సలిల సంభరితమ్ము
అమరర్షి హృదయ పద్మాశ్రయమ్ము
సర్వకల్మష పంకసంచయ శమనమ్ము
శిష్ట ద్విజసమూహ సేవితమ్ము
సద్గంధ బంధుర సమ్మోద కలితమ్ము
స్వేచ్ఛావిహార సుశ్రీకరమ్ము
శంకర ధ్యాన ప్రశంసా కవిబుతమ్ము
కైవల్య జీవన కామ్యదమ్ము

మానస మరాళమా! మంచి మాట వినవె
సాయి సద్భక్తి సుందర సరసి చూచి
అందు విహరింప నీకు సౌఖ్యములు కలుగు
ఉప్పు నీళ్ల కయ్యల వెంట నురకనేల

## వ్యాఖ్య

మానస మరాళమా! ఇక్కడ సత్యశివసుందర సాయీశ్వరుడి భక్తి రస భరితం అయిన సుందర సరోవరం ఒకటున్నది. దీనిలో విహరింతువుగాని రా! మరాళమా! మారుమాటాడకు.

దీనినిండా శాశ్వత సుఖ సారం అనే నీరు ఉంది. దీనిలో దేవర్షుల హృదయారవిందాలు వికసించి ఉంటాయి. కల్మషం అనే పంకం అణిగి నీరు స్వచ్ఛంగా తేరి ఉంటుంది.

శ్రేష్ఠమైన విహంగాలు ఈ కోనేటిని ఆధారం చేసుకొని జీవిస్తుంటాయి. కిలకిలారావాలతో కలనాదం వినిపిస్తుంటుంది. కమల కషాయ సమ్మోద సుగంధ పరిమళంతో ఈ ప్రాంతమంతా గుబాళించి శోభాయమానంగా ఉంటుంది. నీకు స్వేచ్ఛావిహారానికి చాలా అనుకూలంసుమా!

శుభంకరమైన ధ్యానం చేత ప్రవేశింపదగిన సరోవరం ఇది. ఇది కైవల్య దివ్యామృతం అందిస్తుంది. ఇంత మధుర మహిమాన్విత మందాకినిని విడిచి ఉప్పునీళ్ళ కయ్యలకు పోతానంటావేమిటి? నా మాట విని ఈ సరసిలో విహరిస్తే నీ జన్మ చరితార్థమవుతుంది. అల్పసుఖాలు ఆశించి అటూ ఇటూ పరు వెత్తి ఆయాసపడనేల! నా మాటవిను.

"హరి సరసి విగాహ్య" —ముకుందమాల

## 49. పూలపందిరి

ఆనందామృతపూరితా హరపదాంభోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్న ముపేత్య భక్తిలతికా శాఖోపశాఖాన్వితా,
ఉచ్చైర్మానసకాయమానపటలీ మాక్రమ్యనిష్కల్మషా
నిత్యాభీష్టఫలప్రదా భవతుమే సత్కర్మసంవర్ధితా

పద్యం

పార్వతీపతి దివ్యపాదమ్ము పాదుగా
 సంవిదానందమ్ము జలముకాగ
స్థైర్య ధైర్యాదులు స్తంభాలుగా నిత్య
 కార్యక్రమాలు పై కంప కాగ
అనయమ్ము పరువెత్తు మనసు పందిరి కాగ
 శమదమాదులు గ్రంధి సమితికాగ
పావన కృత్యాలు పల్లవమ్ములుకాగ
 సద్వాంఛితాలు పుష్పములుకాగ

నా లలిత భక్తిలతిక పుణ్యకరమైన
నవవసంతోదయాన పల్లవము లెత్తి
అమృతఫలములుకాసె సత్యస్వరూప!
వందనమ్ములు శతకోటి చందనములు!

వ్యాఖ్య

స్వామీ! నా ఈ భక్తిలత ప్రాకి పందిరికెక్కి పూలుపూచి ఫలాలు అంది స్తోంది దేవా! నా ఈ నవభక్తిలతకు పార్వతీనాథుని పాదమే పాదు. సంవిదా నందమే ఈ లతలకు నీరు.

స్థైర్యం ధైర్యం మొదలైన గుణాలు స్తంభాలుగాపాతి పైన సత్కార్యాలు అనే చిరుకొమ్మలు తెచ్చి కప్పాను. శమ దమాదులనే త్రాళ్ళతో గట్టిగా ముళ్ళు వేశాను. అపుడు మనసు పత్తెపూల పందిరిగా తయారయింది సాయీశా!

ఈ భక్తిలతలు నీ కటాక్ష వీక్షణామృత సేచనంతో పెరిగి పందిరికి పాకాయి. ఈలతలు పావన కృత్యాలు అనే నిత్య సుందర వల్లవాలు తొడిగి ముందుకుసాగి అల్లిబిల్లిగా అల్లుకొన్నాయి. దీనికి సద్వాంఛితాలు అనే పుష్పాలు పూచాయి. అమృతఫలాలు కాశాయి.

సర్వ రక్షా దక్షా! నీ అవ్యాజమైన అపార కృపామృతానికి అనేక కృతజ్ఞతా పారిజాతాలు.

యోగక్షేమం వహామ్యహమ్ —గీత

## 50. మల్లికార్జునస్వామి

సంధ్యారంభవిజృంభితం శ్రుతిశిరఃస్థానాంతరాధిష్ఠితం
సప్రేమభ్రమరాభిరామ మసకృ త్సద్వాసనాశోభితం,
భోగీంద్రాభరణం సమ స్త సుమనః పూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరిమల్లికార్జునమహాలింగం శివాలింగితమ్

పద్యం

సౌవర్ణరుచిపూర్ణ సంధ్యా ముహూ ర్తాల
శ్రీకర నృత్యమ్ము సేయునదియు
వేదాంతకాంతా శిరో దర్శనీయ కి
రీట రత్నమయి వ ర్తించునదియు
క్రమమౌ భ్రమరాంబికా గాఢ పరిరంభ
శృంగార రసము చిందించునదియు
అభిషేకమొసరింప ఆనందపడిపోయి
కోరినవన్ని చేకూర్చునదియు

వాసుకి సురత్నభూషణ వాసితమ్ము
సతత సుమనో మునీశ పూజితమ్మై న
మల్లికార్జున లింగమున్ మనసుదీర
ధ్యాన మొనరించుకొందు "సోఽహ"మ్మటంచు

## వ్యాఖ్య

మల్లికార్జున స్వామీ! శ్రీశైలనివాసీ! నిన్ను ధ్యానిస్తున్నాను.

ద్వాదశ జ్యోతిర్లింగాలలో విశిష్టమైన మూర్తి నీవు. సంధ్యా సమయం ఆసన్నమయింది. మద్ది చెట్టు విరబూచి ముందుకు వంగి పుష్పాంజలి ఘటించింది. ఓ శివమూర్తీ సంధ్యా సమయంలో తాండవం చేస్తున్నావు. వేదవేదాంత విజ్ఞాన పరమార్థ పరంజ్యోతిని అందించటంలో సర్వశ్రేష్ఠ శిరోభూషణుడవీవు. ఓంకార ఝంకార భ్రమర గీతాలాపన వింటూ పరవశించి శృంగారం ఒలకబోస్తున్నావు. క్షీరాభిషేకాలకు పొంగిపోయి భక్తుల అభీప్సితాలు అన్నీ నెరవేరుస్తున్నావు. నాగాభరణాలతో శోభాయమానంగా దర్శనం ఇస్తున్నావు.

ముని జనులచేత పూజింపబడుతూ లోకాలను కళ్యాణ కరంగా పరిపాలించే ఓ శివమూర్తీ 'సోఽహమ్' అని నిన్ను నిరంతరం ధ్యానిస్తున్నాను. నా ఈప్సితం నెరవేర్చు.

ఉత్క్రామంతం స్థితం వాఽపి
భుంజానంవా గుణాన్వితమ్
విమూఢా నానుపశ్యంతి
పశ్యంతి జ్ఞాన చక్షుషః

## 51. శ్రీశైలవాసిః

భృంగీచ్ఛానటనోత్కటః కరిమదగ్రాహీ స్ఫురన్మాధవా
హ్లాదో నాదయుతో మహాసితవపుః పంచేషుణా చాదృతః,
సత్పక్షస్సుమనోఽవనేషు సపున స్సాక్షాన్మదీయో మనో
రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీ విభుః

పద్యం

భృంగి మనసెరింగి నృత్యమ్ము సేయుచు
కరి మదమ్ము హరించి మురియువాడు
మాధవీ సౌందర్య మాధుర్య మానుచు
ఝుంకార గానమ్ము సలుపువాడు
వరమహాసితవర్ణ పరమదేహమువాడు
మంజుకంజీత జిత మన్మథుండు
సుమనోవన కళా విశుద్ధ భావమువాడు
అఖిల ప్రపంచ విహారరతుడు

పరమ శ్రీశైలమననొప్పు పర్తిలో వ
సించు సత్యసాయీశ్వర శ్రీగణుండు
నా మనః పద్మ మధు మరందమ్ములాని
భృంగమై ఎల్లపుడు విహరించుగాత!

## వ్యాఖ్య

శ్రీశైల మల్లికార్జునస్వామిని భృంగంగా వర్ణించిన సందర్భం యిది. మల్లికార్జునస్వామి భార్య పేరు భ్రమరాంబ. భ్రమరానికి మరోపేరు భృంగం. భృంగి ఆడుతుమ్మెద. భృంగం మగతుమ్మెద. ఇపుడు శివుడు భృంగరాజు అయినాడు.

శివసేవకులలో అగ్రగణ్యుడు భృంగి యనువాడు. ఇతడే నందీశ్వరుడు. ఈతడు పరమేశ్వర భక్తుడు. మల్లికార్జునుడు భృంగరాజు అయి తాండవం చేస్తున్నాడు. భృంగి యిచ్ఛానుసారంగా—భృంగి హృదయమెరిగి అని ధ్వని వచ్చేలాగ, భక్తవాంఛాధీనుడుగాను, భార్యాలోలుడుగాను స్ఫురించాలని "భృంగీచ్ఛానటనోత్కటః" అంటారు శంకరులవారు.

భ్రమరాంబాధిపతీ! భృంగం కరీంద్ర మదదాన మరందం త్రాగి ఆనందం పొందుతుంది. నీవు గజాసురుని మదం హరించి ఆనందముగా ఉన్నావు. భృంగం వసంతం అంటే చాలయిష్టపడుతుంది. నీవు మోహినీరూపం ధరించిన "మాధవు" డంటే యిష్టపడుతున్నావు. తుమ్మెదకి ఝంకారనాదం, నీకు ప్రణవనాదం. పుష్పవనమందు అభిమానం తుమ్మెదకి. ఉత్తములను రక్షించటంలో దీక్ష నీకు. కాబట్టి చిత్తకమలంలో నీవు ఉండటం సహజమే కదా.

మానవాకారంలో నా మనోరాజీవంలో నిల్చి దర్శనం యిస్తున్న పరమేశ్వరా! శ్రీశైలంవంటి ప్రశాంతినిలయంలో మానవాకృతి పొంది మమ్ము ఉద్ధరిస్తున్న సాయీ భృంగరాజా! నీకివే అనేక వందనాలు!

"సర్వ సద్బుద్ధి మాప్నోతు"

## 52. శివాంబుదం

కారుణ్యామృతవర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదా కర్మఠం
విద్యాసస్యఫలోదయాయ సుమనస్సంసేవ్య మిచ్ఛాకృతిమ్,
నృత్యద్భక్తమయూర మద్రినిలయం చంచజ్జటామండలం
శంభో వాంఛతి నీలకంధర సదా త్వాం మే మనశ్చాతకః

పద్యం

హర్షంపు కారుణ్యవర్షమ్ము వర్షించు
అతి విపద్గ్రీష్మమ్ము నణచివేయు
లలితవిద్యా సార ఫలముల నందించు
సుమనస్సు సేవ్యమై శోభజెందు
భక్త మయూరాలు భరతమ్ము లాడగా
పర్వత శిఖరాల వాసముండు
చంచద్ఘన జటాలస న్మహావేశాన
డమరు వాద్యంబున డంబు జూపు

అమృత శంకరానంద సాయ్యంబుదంబు
విష్ణుపదమున కన్నుల విందు సేయ
చాతకంబయి నామానసమ్ము సతము
ఉబ్బి తబ్బిబ్బులగుచుండు అబ్బురముగ

## వ్యాఖ్య

నీలకంఠుడు నీలమేఘమై సాక్షాత్కరించాడు. నా చిత్తం చాతకమై ఆనందం పొందుతోంది.

శివ మేఘం కారుణ్యామృతాన్ని హర్షంగా వర్షించసాగింది. ఆ కారుణ్యామృత మేఘం విపత్తు అవే గ్రీష్మతాపాన్ని అణచివేస్తున్నది. అది సువిద్యా సస్యం పండిస్తున్నది. అది సజ్జనులచేత సుమనస్సులచేత ప్రశంసింపబడుతున్నది.

ఆ శివ మేఘాన్ని చూడగనే భక్త హృదయాలు మయూరాలై నాట్యం చేస్తాయి. ఆ శివమేఘం పర్వత శిఖరాలపై దోబూచు లాడుతూ దర్శనం ఇస్తుంటుంది. ఆ మేఘం నల్ల నల్లని పెనుజడలు ధరించి వాటిని కదిలిస్తూ మెరిపిస్తూ మురిపిస్తూ ఢమరుక వాద్యాలు ప్రయోగిస్తూ ఆనంద పరుస్తుంది.

ఆ శంకరమేఘం విష్ణుపదం అయిన ఆకాశ వేదిపై నేత్రపర్వంగా ప్రకాశిస్తోంది. ఆ శంకరమేఘం కనిపించగనే నామనస్సు అనే చాతకం ఉబ్బి తబ్బిబ్బయి వర్షబిందువుకై నోరు తెరచి అట్టేచూస్తుంటుంది. నా మానసికస్థితి నాకే ఆశ్చర్యకరంగా ఉంటుంది. ఆ శివమేఘం నా కోరిక తీర్చుగాక!

"అగ్నేనయ సుపథా రాయే అస్మాన్"

## 53. శంకర మయూరం

ఆకాశేన శిఖీ సమస్తఫణినాం నేత్రా కలాపీ నతా
నుగ్రాహి ప్రణవోపదేశ నినదైః కేకీతి యో గీయతే,
శ్యామాం శైలసముద్భవాం ఘనరుచిం దృష్ట్వా నటంతంముదా
వేదాంతోపవనే విహార రసికం తం నీలకంఠం భజే

పద్యం

వ్యోమమే శిఖయౌట ఉన్నత శిఖియంచు
పాపరా నగచే కలాపి యంచు
ఓంకార నాదామృతోపదేశము చేత
కేకి యంచును సదా కీర్తితుండు
శ్యామసుందరి గాంచి సంతసించెడివాడు
అద్రిజకై నాట్యమాడువాడు
వేదాంత కాంతారవీథి తిర్గెడివాడు
కంఠమందు నలుపు కలుగువాడు

అయిన శ్రీసత్యసాయీ మహా మహేశ
నీలకంఠమ్ము నెప్పుడు నెనరు మీర
నా మనః శ్రీగిరీంద్ర వృక్షమున నిలిపి
శివ రసామృతమానెద చిత్త మలర

## వ్యాఖ్య

నీలకంఠుడు నీలకంఠమై నృత్యం చేస్తున్నాడు. ఇరువురికి సామ్యములు సరిపోయినాయి.

శివుని జటాజూటం దర్శనీయం. శివుడు వ్యోమకేశుడు. శిఖ అంటే శిరోజపై భవం. నెమలి కూడా శిఖగలదే. నెమలి తలపై చుంచువు ఉంది. అది అందంగా మెరుస్తూ చక్కగా వుంటుంది. శివుడు నెమలి ఇరువురూ శిఖులే.

శివునికి సర్పములు ఆభరణాలు. అలంకృతుడు కాన ఆ స్వామి కలాపి. మయూరానికి పాములతో చెరలాటలంటే చాల ఇష్టం. దానికి పింఛం ఉంటుంది. అందుకని మయూరం కూడ కలాపియే.

శివునిది ఓంకారం, మయూరానిది క్రేంకారం. రెండూ శ్రవణీయములే. ఓంకార నాదోపదేశంచేత శివునికి, క్రేంకారం చేత నెమలికి కేకి అనే పేరు సార్థకమయింది.

శివుడు పార్వతీ ప్రియుడు. మయూరం కూడ పర్వత ప్రదేశాలలో విహరిస్తుంది. పార్వతిప్రీతికై శివతాండవం జరుగుతుంది. పార్వత ప్రకృతికి పరవశించి మయూరం నృత్యం చేస్తుంది. వేదాంతోపవనం శివునికిప్రీతి. వనాలు కేకికిప్రీతి. శివుడు నీలకంఠుడు, నెమలి కూడ నీలకంఠమే.

ఇటువంటి సాయీశ్రీకంఠుడు నామనః పర్వత వృక్షాలపై విహరించుగాక! ఆ ఆనందానుభూతి నాకు లభించుగాక!

"నమో నీలగ్రీవాయ"

# 54. సంధ్యా తాండవం

సంధ్యా ఘర్మదినాత్యయో హరికరాఘాతప్రభూతానక
ధ్వానో వారిదగర్జితం దివిషదాం దృష్టిచ్ఛటా చంచలా,
భక్తానాం పరితోషబాష్పవితతి ర్వృష్టి ర్మయూరీ శివా
యస్మిన్నుజ్జ్వల తాండవం విజయతే తం నీలకంఠం భజే

పద్యం

సంధ్య వినూత్న వర్షాకాలమయ్యె అ
మరుల చూడ్కులు పెను మెరుపులయ్యె
హరి మృదంగధ్వాన మురుము చప్పుళ్లయ్యె
పక్షివ్రాతము నట్టువాంగమయ్యె
భక్తుల హర్షబాష్పాలు వర్షంబయ్యె
దిశలెల్ల రంగుల తెరలునయ్యె
నీలకంఠస్వామి నీలకంఠంబయ్యె
గౌరికుమారి మయూరియయ్యె

శివశివానంద తాండవ శ్రీవహించి
విశ్వమంతయు నవకళావేదియయ్యె
రాజశేఖర! నటరాజ! ప్రబలతేజ!
ముక్తికాంతామనోజ! నమో నమోస్తు

## వ్యాఖ్య

పార్వతీ పరమేశ్వరులు పరమానందంతో [illegible] తాండవం చేస్తున్నారు. ఆ తాండవం [illegible] అపురూపమైన [illegible] స్తున్నది.

సంధ్యాసమయం వర్షారంభ సమయం [illegible] ఆరంభమయింది. అంతరిక్షం నుంచి చూస్తున్న [illegible] మెరుస్తున్నాయి. ఆ నృత్యానికి సహకారంగా [illegible] వాద్యపు సవ్వడి ఉరుములుగా వినిపిస్తున్నాయి. [illegible] అమరింది. భక్తుల ఆనంద బాష్పధారలే [illegible] రంగుల తెరలుగా భాసిల్లినాయి.

నీలకంఠుడు సాక్షాత్తు నీలకంఠమైనాడు. [illegible] మయూరియైనది. పార్వతీ పరమేశ్వరుల ఆనంద తాండవంతో [illegible] నిసూత్న కళావేదికగా విలసిల్లుతోంది.

స్వామీ! నటరాజా! రాజశేఖరా! [illegible] సహస్రాలు స్వీకరించు ప్రభూ!

వాగ్దేవీ ధృతవల్లకీ. శతమఖో వేణుం. దధత్పద్మజ
స్తాలోన్నిద్రకరో. రమా భగవతీ గేయప్రయోగాన్వితా.
విష్ణుస్సాంద్ర మృదంగవాదనపటుః. దేవా [illegible]
సేవంతే. తమను ప్రదోషసమయే దేవం [illegible]

—[illegible]

## 55. నిత్య సత్య సాయీశ్వరుడు

ఆద్యాయామితతేజసే శ్రుతిపదై ర్వేద్యాయ సాధ్యాయతే
విద్యానందమయాత్మనే త్రిజగతస్సంరక్షణోద్యోగినే,
ధ్యేయాయాఖిల యోగిభి స్సురగణై ర్గేయాయ మాయావినే
సమ్యక్తాండవ సంభ్రమాయ జటినే సేయం నతిశ్శంభవే

పద్యం

ఆదిసృష్టికి ముందు పాదైన దేవర!
జాజ్వల్యమాన తేజస్వరూప!
ఆత్మవిద్యా చిన్మయానందమయమూర్తి!
విశ్వవిరాణ్మహా వేదవేద్య!
సర్వయోగసుసాధ్య సారస్వతస్ఫూర్తి!
త్రైలోక్య పాలకాధ్యక్ష దక్ష!
ధర్మకర్మజ్ఞాన మర్మతత్త్వజ్ఞేయ!
వాసుదేవ బ్రహ్మ వర్ణనీయ!
మహిత గంగాధరా! జటామకుటధారి!
తాండవప్రియ! సత్కళాతత్త్వహృదయ!
అఖిల దేవతార్చిత చరణారవింద!
వందనమ్ములు సాయీ! శివా! మహేశ!

## వ్యాఖ్య

సాయీ శివా! మహాదేవా! స్వామీ! నీవు సృష్టికి ముందు నుంచీ ఉన్న వాడవు. సృష్టికి పాదైన వాడవు. నిత్య సత్య జ్యోతిర్మయ స్వరూపుడవు. ఆత్మ విద్యామూర్తివి. వేద విజ్ఞాన రాశివి. చిన్మయానందుడవు. విశ్వ విరాణ్మూర్తివి. యోగీశ్వర విద్యా పరిపక్వ సాహిత్య జ్యోతిః ఫలానివి.

భగవాన్! నీవు త్రైలోక్య పాలనాదక్షుడవు. ధర్మం కర్మం జ్ఞానం వైరాగ్యం వాని మర్మాలు ధర్మాలు తెలిసి, తెలియజెప్పే ఉదారమూర్తివి. వాసుదేవుడవు. ఈశావాస్యమీవు. గంగాధరుడవు. జటాధారివి. తాండవప్రియుడవు. నటరాజువు. సర్వకళా హృదయుడవు.

దేవతార్చిత పాదారవిందా! వందారు వరదా! సాయీశ్వరా! నమస్కారము—

ఎవరెవరి నుద్దేశించి చేసిన నమస్కారమైనా సర్వ జగత్కారణుడు, సర్వాంతర్యామియైన ఆ పరమేశ్వరునికే చెందుతుందని పరమార్థం.

"విశ్వస్య స్రష్టారమ్"

## 56. శివ స్వరూపం

నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయనీ శ్రేయసే
సత్యాయాదికుటుంబినే మునిమనఃప్రత్యక్ష చిన్మూర్తయే,
మాయాసృష్ట జగత్త్రయాయ సకలామ్నాయాంతసంచారిణే
సాయం తాండవ సంభ్రమాయ జటినే సేయం నతిశ్శంభవే

పద్యం

త్రిగుణస్వరూపుండు త్రిపురాసుర హరుండు
ఫాలనేత్రుండు త్రిశూలపాణి
నిత్యుండు కాత్యాయనీ ప్రాణనాథుండు
సత్యుండు ఆది సంసారరతుడు
మునిజనః ప్రత్యక్ష మోక్షణ వరదుండు
వందారు మందార సుందరుండు
త్రిజగతీ సృష్టి నిర్మితికి ఆధారుండు
ఆమ్నాయ వీథీ విహార మౌళి

తాండవ కళా ప్రియుండు సద్ధర్మపరుడు
సాధుహృదయుండు నిర్మల సాత్త్వికుండు
విశ్వనాథుండు సత్యసాయీశ్వరుండు
స్వామి పాదాబ్జముల కభివందనములు

## వ్యాఖ్య

ఈశ్వరుడు సాయీశ్వరుడు! ఈ స్వామి నిత్య సత్య స్వరూపుడు, శాశ్వతుడు!

శివుడు త్రిగుణాత్మకుడు. త్రిగుణాతీతుడు. త్రిపుర సంహారకుడు. పురము లంటే దేహాలు. దేహభ్రాంతి దూరం చేసేవాడు. ఫాలనేత్రుడై జ్ఞానాగ్నిని ప్రజ్వరిల్ల చేసేవాడు. ఈస్వామి నిత్య సత్యుడు, కాత్యాయనీ ప్రాణవల్లభుడు. జ్ఞానమయ సువిద్యా లోలుడు. సమ్యక్ సారమందు ప్రీతి కలిగించువాడు.

పరమేశ్వరుడు మునీశ్వరులకు ప్రియుడు. చిదానందమయుడు. పంచ ముక్తులలో చివరిదైన కైవల్యం ప్రసాదించేవాడు. నమస్కరించిన వారి కోర్కెలు ఈడేర్చేవాడు, శివశక్తితో కూడిన త్రిజగత్ సృష్టికి మూలకారణభూతుడైన వాడు.

ఈ దేవదేవుడు వేదాంత వీథీ విహారశీలి, సర్వకళా ప్రియుడు, ధర్మమూర్తి, సాధు హృదయుడు, సాత్త్విక మూర్తి. ఈ శంకరుడు విశ్వనాథుడు, సాయీశ్వరుడు, సాంబమూర్తి, సోముడు, సోమశేఖరుడు. అట్టి స్వామి పాదారవిందాలకు ప్రణామాలు.

"నిత్యో నిత్యానాం
చేతన శ్చేతనానాం"

# 57. కృపాళువు

నిత్యం స్వోదరపోషణాయ సకలానుద్దిశ్య విత్తాశయా
వ్యర్థం పర్యటనం కరోమి భవతస్సేవాం నజానే విభో,
మజ్జన్మాంతర పుణ్యపాకబలత స్త్వం శర్వ సర్వాంతర
స్తిష్ఠస్యేవహి తేనవా పశుపతే తే రక్షణీయోఽస్మ్యహమ్

పద్యం

ఉదరపోషణమున నూరూరు తిరిగితి
అన్నపూర్ణానాథ! ఆశుతోష!
ధనముకై గర్వాంధ జనుల యాచించితి
శంభుదేవా! మహైశ్వర్యవిభవ!
కీర్తికై రాజుల కీర్తించి డస్సితి
స్తోత్రప్రియా! పరిశుద్ధహృదయ!
ఐహికసుఖములు మోహించి విసివితి
కైవల్యనేత! సౌఖ్యప్రదాత!

నిను నెరుంగనివాడనైనను - మహాత్మ!
నీకు దయజూపదగువాడనే కృపాళు!
అఖిల జీవులయందు నున్నట్లె నీవు
దేవ! నాయందు నిలచియున్నావు కావ!

వ్యాఖ్య

స్వామీ! అన్నపూర్ణా మనోహరా! అల్ప సంతోషీ! శంభో! మహాదేవా! స్తోత్రప్రియా! దయామయా!

నీ సంగతి తెలియక మూఢుడనై ఇంతవరకు చాల చోట్ల తిరిగి ఈ జీవన యాత్రలో అలసిపోయాను దేవా! పొట్ట చేతితో పట్టుకొని ఊరూర తిరిగాను. ధనం కొరకు మానధనం కుదవబెట్టి ధనికులను ఆశ్రయించాను. ఎంతమంది అయోగ్యులనో పొగిడాను. ఐహిక సుఖాలు నిత్యం అనుకొని కైవల్య దాతవని నిన్ను గుర్తించలేక వ్యర్థంగా ప్రవర్తించాను.

ఇటువంటి మూఢుణ్ణి ఎవరు ఉద్ధరిస్తారు స్వామీ! రక్షిస్తే నీవే రక్షించాలి. ఇందుకు సమర్థుడవు నీవే. అందరి ఆత్మలలో జ్యోతి స్వరూపుడవై ఉన్నావు. నాలోనూ ఉన్నావు. కాని ఇంతవరకు నేను గుర్తించలేదు. ఇప్పుడు గుర్తించాను. స్వామీ! ఇక నిన్ను విడువను - నన్నుద్ధరించటానికే నాలో జేరి నిలిచి ఉన్నావు. పశుపతీ! జగత్పతీ! ఇక నన్ను కాపాడు స్వామీ! అంతర్యామీ!

స్మరామి సాయీశ్వర సుందరాకృతిమ్
వదామి సాయీశ్వర నామపావనమ్
భజామి సాయీశ్వర పాదపంకజమ్
నమామి సాయీశ్వర ఈశ్వరేశ్వరమ్ —కరుణశ్రీ

## 58. ప్రభారాశిః

ఏకో వారిజబాంధవః క్షితినభోవ్యాప్తం తమోమండలం
భిత్వా లోచనగోచరోఽపి భవతి త్వం కోటిసూర్యప్రభః,
వేద్యః కిం నభవస్యహో ఘనతరం కీదృగ్భవేన్మత్తమ
స్తత్సర్వం వ్యపనీయ మే పశుపతే సాక్షాత్ప్రసన్నోభవ

పద్యం

నడిరేయి దారికన్పరచి మిన్కుమనుచు
ఒకచుక్క కనిపించుచుండు మింట
మందిరమ్ము తమస్సు మాయమ్ముచేసియు
ఒకదివ్వె కనిపించుచుండు ఇంట
ఉడుకెత్తు తాపమ్ము నుడిగించి చల్లగా
ఒకశశి కనుపించుచుండు రేయి
లోకాలునిండిన చీకట్లు పోకార్చి
ఒక రవి కనిపించుచుండు పగలు

కోటిసూర్యప్రభారాశి! మాటయితివ!
నాచిదజ్ఞాన తామసాంతరములందు
నీవుకాకెవ్వరున్నారు దేవ! తమము
ఎట్టులైనను నీవె హరింపవలయు

వ్యాఖ్య

దేవా! నీవు కోటి సూర్యప్రభారాశివి. నాలోని అజ్ఞానాంధకారాన్ని దూరం చేయి సాయీ!

స్వామీ! ఆకాశంలోని చిన్ని చుక్క అర్ధరాత్రి మినుకు మినుకుమంటూ దారిని లీలగా కన్పింపజేస్తుంది. చిన్ని దీపం ఇంటిలో చీకటి దూరం చేస్తుంది. చంద్రుడు రాత్రిని ప్రకాశవంతం చేస్తాడు. వారిజబంధువైన సూర్యదేవుడు భూమ్యాకాశాలు నిండిన చీకటిని ఛేదించి పగటిని కలిగించి ఉపకారం చేస్తాడు

నీవు కోటి సూర్యప్రభామూర్తివి. నీవు నాలోని అజ్ఞానాంధకారాన్ని దూరం చేయలేవా! నా ఆత్మలో అనవరతం ప్రకాశించే జ్యోతిర్మయమూర్తీ! మాయామోహాంధకారం మటుమాయం చేయి స్వామీ! నీవు చేయలేక కాదు— నాపై ఎందుకో ఉపేక్ష వహించావు. ఇక చాలు కానీ ఉపేక్ష మాని అపేక్ష పూని నీ కటాక్షాన్ని ప్రసరింపచేసి నన్ను రక్షించు స్వామీ! నేను నీకై ప్రతీక్షిస్తున్నాను.

ప్రీతిపూర్వకం భజతాం తేషాం
తమః నాశయామి ఆత్మభావస్థః
జ్ఞానదీపేన భాస్వతా....

# 59. కోరిక

హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోర స్తథా,
చేతో వాంఛతి మామకం పశుపతే చిన్మార్గమృగ్యం విభో
గౌరీనాథ భవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదమ్

పద్యం

రాజహంసశ్రేణి రమణీయ రాజీవ
వనవిహారమ్ము కోరినవిధాన
కూర్మినిండారు చకోరముల్ చారు చాం
ద్రీ రసాయనము కోరినవిధాన
చాతకరాజముల్ శ్యామసుందర శీత
ఘనసుధాజలము కోరినవిధాన
చక్రవాకాంగనల్ జగదభ్యుదయ రవి
శ్రీవికాసమ్ము కోరినవిధాన

సత్యశివసుందర జ్ఞాన శాంతికరము
మూల్యవంతమ్ము పరమకైవల్యదమ్ము
సత్యసాయీశ్వర పవిత్ర చరణ దర్శ
నమ్ము కోరును నా మానసమ్ము సతము

వ్యాఖ్య

సాయీశ్వరా! నా మనస్సు నీ పాదారవిందాలను దర్శించాలని, స్పృశించాలని, అమితంగా కోరుకొంటున్నది.

ఎలాగయితే రాజహంసలు పద్మవన విహారం చేయాలని అపేక్ష పడుతుంటాయో-

చకోరాలు పూర్ణేందు చంద్రికా ప్రవాహంలో ఈదులాడాలని ఉవ్విళ్ళూరుతుంటాయో-

చాతకాలు నవవర్షమేఘధారలు కడుపార గ్రోలాలని ఉగ్గపట్టుకొని ఉంటాయో-

చక్రవాకాలు నవనవారుణోదయ సూర్యరశ్మిని ఆకాంక్షిస్తుంటాయో-

ఆ విధంగా స్వామీ! ఉపనిషద్వేద్యమై, కైవల్య సుఖం ప్రసాదించే నీ పాద కమలాలను నా మనస్సు కోరుకొంటున్నది. ఆశుతోషా! నీ దర్శనం అనుగ్రహించు స్వామీ!

"త్వాం ప్రపద్యే మహేశ్వరమ్"

## 60. ఆశాజీవి

రోధస్తోయహృతః శ్రమేణ పథికచ్ఛాయాం తరోర్వృష్టితో
భీతః స్వస్థగృహం గృహస్థమతిథి ర్దీనః ప్రభుం ధార్మికమ్,
దీపం సంతమసాకులశ్చ శిఖినం శీతావృత స్త్వం తథా
చేతస్సర్వభయాపహం వ్రజసుఖం శంభోః పదాంభోరుహమ్

పద్యం

పర్వత వర్షప్రవాహాలలో కొట్టు
కొనిపోవు వా డొడ్డుకోరినట్లు
గ్రీష్మప్రయాణాల ప్రీలి డస్సినవాడు
శీతలచ్ఛాయ వాంఛించినట్లు
అంధకారమ్ములో అలమటించెడు వాడు
చిరువెల్గులను అపేక్షించినట్లు
చలికి బిర్రబిగిసి వనిగొన్న వాడింత
కొంచమ్ము వెచ్చన కోరినట్లు

**శంకరా! మహాదేవ! శ్రీసత్యసాయి!**
**మాయయగు భవజలధిలో గాయపడిన**
నామనసు నిన్నె కోరుచున్నది దయాళు!
భవజలధి దాపి అపవర్గ సౌఖ్యమిమ్ము

వ్యాఖ్య

ప్రభూ! దయాళూ! ఈ సంసార సాగరంలోపడి కొట్టుకొని పోయే నన్ను ఆర్తత్రాణ పరాయణుడవైన నీవే రక్షించాలి. నిన్నే చివరకు ఆశ్రయిస్తున్నాను.

స్వామీ! ఉరవడిగా పొంగి పొరలి ప్రవహించే కొండవాగులో పడ్డవాడు ఒడ్డుకై చేతులు చాచినట్లుగా-

ఎడారిలో గ్రీష్మఆతపంలో ప్రయాణించేవాడు వృక్షంపు శీతలచ్ఛాయకోరు కొన్నట్లుగా-

వర్షంలో తడిసిపోతున్నవాడు తలదాకొచునే గూడుకోసం పరుగెత్తినట్లుగా-
అతిథి తనను ఆదరించే ఉత్తమ గృహస్థుని కాంక్షించినట్లుగా-
పేదవాడు తన పేదరికం రూపుమాపే దాతకై అన్వేషించినట్లుగా-
చలికి బిర్రబిగిసినవాడు చిరువెచ్చదనం కోరినట్లుగా-

ఈ సంసార జంజాటంలోపడిన నామనస్సు దిక్కుతోచక నీ దిక్కే చూస్తున్నది. నీవే తప్ప ఇతః పరంబెరుగ రావే ఈశ్వర కావవే వరద! సంరక్షింప సాయీశ్వరా!

"సర్వదుఃఖాతిగో భవేత్"

## 61. చేదుకోసాయి!

అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీనైజవిభుం లతాక్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్,
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవింద ద్వయం
చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే

పద్యం

ఊడుగుబీజము లుర్వ్విరాలిన వన్ని
చెట్టు మ్రానుకడకు చేరినట్లు
ఇల అయస్కాంతమ్ము బలముగా వేగి ఇ
నుప వస్తు వితతి అంటుకొనినట్లు
పరమపతివ్రత బాధలెన్నొ సహించి
తన ప్రాణపతి జేరుకొనినయట్లు
పర్వత శిఖరాల ప్రభవించిన నది క్ర
మించి వార్ధిని సంగమించినట్లు

నామనస్సెప్డు నీదు సుందర పదార
విందముల నంటియుండు నో వేదవేద్య!
మందభాగ్యుడ నేను రమాహృదీశ!
నీవె రక్షింపవలె సాయి! నీలకంఠ!

## వ్యాఖ్య

పశుపతీ! జగత్పతీ! నా మనస్సు సహజ సిద్ధంగా ఎవరి ప్రేరణ లేకుండగా నీపాదారవిందాలు ఆశ్రయించేలా వరం అనుగ్రహించు దేవా!

ఊడుగుచెట్టు గింజలు పుడమిపై రాలి కొంతకాలానికి వాటంతటవే మానుకు అంటిపెట్టుకొనటానికై పరుగులు పెట్టినట్లుగా-

అయస్కాంతాన్ని లోహవస్తువులు వెళ్ళి అంటుకొన్నట్లుగా-

పతివ్రతామణి ఎన్ని కష్టాలైనా సహించి తన పతిని చేరుకొన్నట్లుగా-

లతలు వృక్షాలను ఆశ్రయించినట్లుగా-

నదీమతల్లులు సముద్రంతో ఏకమయినట్లుగా-

నా మనస్సు నీపాదాల చేరుకొనేలా వరం ప్రసాదించు పరమేశ్వరా!

నామనస్సుకు అలాంటి సహజమైన బలవత్తరమైన భక్తిని, శక్తిని ఎప్పుడు ప్రసాదిస్తావో నన్నెప్పుడు చేదుకొంటావో కదా!

"సైవగ్రాహ్యా ముముక్షుభిః"

## 62. భక్తి జనని

ఆనందాశ్రుభిరాతనోతి పులకం నైర్మల్యత శ్ఛాదనం
వాచాశంఖముఖస్థితైశ్చ జఠరాపూర్తిం చరిత్రామృతైః
రుద్రాక్షైర్భసితేన దేవ వపుషో రక్షాం భవద్భావనా
పర్యంకే వినివేశ్య భక్తిజననీ భక్తార్భకం రక్షతి

పద్యం

ఆనందబాష్పాల స్నానమ్ములాడించి
ప్రియమారమై పుల్కరింపసేయు
ఒడలికి చలిపెట్టకుండ నైర్మల్య ద్వి
పటి ఒండు కప్పి కాపాడుచుండు
శబ్దశంఖమ్ముతో చరితామృతము పట్టి
క్షుద్బాధలేకుండ చూచుచుండు
గాలులు ఇతర రోగాలు రాకుండ రు
ద్రాక్ష విభూతితో రక్షకట్టు
పరమ పరతత్వ సుందర భావనమను
పట్టుపాన్పుపైన పరుండబెట్టుకొనియు
జననియై భక్తబాలుని సాకుచుండు
సాయి! శివదేవ! నీదివ్య చరణభక్తి

## వ్యాఖ్య

సాంబా! భక్తి అంబకదా! మమ్ముకన్నతల్లికదా! భక్తుడైన ఈ శిశువును భక్తి అనే తల్లి ఆనంద బాష్పధారలలో జలకమాడిస్తుంది. ఒడలు పులకరించేలా ఆనందపరుస్తుంది. నైర్మల్యం అనే మంచి పరిశుభ్రమైన దుప్పటి తీసి శరీరానికి చలిపెట్టకుండ మరే ఇతర చలిగాలులు సోకకుండ కప్పుతుంది

శబ్ద జ్ఞానం అనే శంఖం ద్వారా సత్ప్రవర్తన అనే అమృతం కడుపునిండా ఆకలి తీరేలా పట్టిస్తుంది. గాలిధూళీ రోగాలూ రొప్పులూ రాకుండా ఏ దోషాలు అంటకుండా రుద్రాక్షలు కట్టి విభూతిపెట్టి నీ పరతత్త్వ భావనం అనే పట్టు పాన్పుపై పడుకోబెట్టి భక్తి గీతాలు, జోలలు పాడుతుంది. నిద్రబుచ్చుతుంది. ఆనందామృతం అందిస్తుంది స్వామీ!

అటువంటి అనన్యభక్తి మాతృశ్రీని నాకు ప్రసాదించు ప్రభూ! భక్త రక్షకము భక్తి కాక వేరొండు కాదుగదా!

"యల్లబ్ధ్వా అమృతో భవతి తృప్తో భవతి" —నారదసూత్రం

## 63. తిన్నప్ప

మార్గావర్తితపాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే
గండూషాంబునిషేచనం పురరిపో ర్దివ్యాభిషేకాయతే,
కించిద్భక్షితమాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కిం న కరోత్యహో వనచరో భక్తావతంసాయతే

పద్యం

దేవ! అశుద్ధప్రదేశాల తిరిగెడు
చెడు కాలిముచ్చె నీశిరముమెట్టె
సకలలోకాధీశ! ఒక కిరాతకుని ని
ష్ఠీవ నీరము అభిషేకమయ్యె
అన్నపూర్ణానాథ! అడవిమృగముల మాం
సము పంచభక్ష్య భోజనమునయ్యె
వేదాంతవేద్య! వివేకమే ఎరుగని
బిండమానిసి ఇష్టభక్తుడయ్యె
భక్తుని ముదమ్ముకై నీ ప్రవర్తనమ్ము
చిత్రముగదయ్య - శివ! నీ చరిత్ర నెరుగ
హరి సరోజనాభులును జాలరుగదయ్య !
కాళహస్తీశ! పర్తీశ! కావు మీశ!

వ్యాఖ్య

స్వామీ! సర్వాంతర్యామీ! చిత్రాతి చిత్రం కదా నీ చరిత్ర. నీకు భక్తుడంటే ఎంత ప్రేమ! అడవి మనిషి తిన్నడు ఎన్ని నికృష్టమైన పనులు చేశాడు. అన్నీ ఆనందంగా ఆమోదించావు కదా దయామయా! నీ భక్తవాత్సల్యం వర్ణనాతీతం.

ఎక్కడెక్కడి అశుద్ధ ప్రదేశాలలోనో తిరిగివచ్చి తిన్నడు తన కాలి ముచ్చె నీ మొగంపై పెట్టాడు కదా! అది నీవు కాబట్టి సహించావు. అది వినటానికే అసహ్యంగా వుందే.

వాడు ఎంగిలి నీళ్ళు పుక్కిటబట్టి తీసుకువస్తే పావన గంగా జలంవలె అభిషేకానికి స్వీకరించావా!

అడవి పందుల మాంసం కరకుట్లు కాల్చుకు తెస్తే లొట్టలు వేసుకుంటూ నైవేద్యంగా భుజించావా!

ఏ మాత్రం మంచీ చెడ్డా ఎరుగని మూర్ఖుణ్ణి ఇష్టభక్తుడని ప్రశంసించావా!

భక్తి నిన్నెంతగా వశం చేసికొని ఎంతగా ఆడించిందయ్యా!

నీ హృదయం దయామయం. దీని రహస్యం బ్రహ్మాదులకు మాత్రం ఏమి తెలుసు! శ్రీకాళహస్తీశ్వరా! మనుష్యులకే కాదు పురుగుకు పాముకు పశువుకు కూడ మోక్షం ప్రసాదించిన దయామూర్తీ! నమోనమోస్తు!

విల్లొకచంక- అంపపొది వీపున- దొప్పలకేలుదోయి- పు
క్కిళ్ళ పవిత్ర కాంచనముఖీజల మొప్పగవచ్చి భక్తి రా
జిల్ల తదంబు మజ్జనముసేయుచు దొప్పల నంజు డద్రిరా
జిల్లుని ఆరగింపుమన ఆ పరమేశ్వరు డూరకుండినన్-

## 64. పాదుకలు

వక్షస్తాడన మంతకస్య కఠినాపస్మారసంమర్దనం
భూభృత్పర్యటనం నమత్సురశిరః కోటీరసంఘర్షణమ్,
కర్మేదం మృదులస్య తావకపదద్వంద్వస్య గౌరీపతే
మచ్చేతో మణిపాదుకావిహరణం శంభో సదాంగీకురు

పద్యం

బాలేందుశేఖరా! బాలామనోహరా!
దండధరుని యురస్తాడనమ్ము
కైలాసశైలేశ! కౌటిల్య భిల్లేశ!
ఘోర భూమీధ్ర సంచారణమ్ము
వాసవార్చితపాద! వర్ణిత శ్రీవేద
వజ్రకిరీట సంవర్ణితమ్ము
త్రిపురాసురాంతకా! దేవ! కాలాంతకా!
మదమోహ దనుజ సమ్మర్దనమ్ము
పరమ సుకుమారమైన నీ పాద యుగము
ఓర్చుకోలేదు - వినుము నాదొక్కమాట
కోసి చర్మమ్ము చెప్పులు కుట్టి యిత్తు
తొడుగుకోవయ్య గట్టి పాదుకలు స్వామి!

వ్యాఖ్య

పరమేశ్వరా! పశ్రీశ్వరా! సుకుమారా! వట్టికాళ్ళతో అలా తిరుగుతున్నావే! సుకుమారమైన నీ పాదాలు నొప్పిపుడతాయి కానీ నేను చెప్పులు తెచ్చి ఇస్తాను తొడుగుకో!

యముని వక్షస్థలం వజ్రకఠోరం- దానిని వట్టి కాలితో తన్నావు. నీ పాదం ఓర్వగలిగిందా చెప్పు! కపట కిరాత వేషంతో పార్వతమ్మతో సహా ఆ కొండ కోనల్లో రాళ్ళరప్పల్లో తిరుగుతున్నావే ఆ కాళ్ళు బొబ్బలెత్తవూ!

దేవేంద్రాదులు నమస్కారం నెపంతో కఠిన కిరీటాలు నీ పాదాలు తాకేలా మ్రొక్కుతూ ఉంటారు. ఆ తాకిడి తట్టుకోగలవా పద్మసదృశమైన నీ పాదాలు! రాక్షస సంహారాలకు ఇలానే పరుగులు పెడుతుంటావు, పాదుకలు కూడా లేని కాళ్ళతో- ఎలా ఇలా అయితే. కాళ్ళకు గాయాలు తగలవూ! నీ చరణాలు అతి మృదులాలు. నాదొక మాట విను-

నా చర్మం ఒలిచి చెప్పులు కుట్టి ఇస్తాను. వాటిని మణులతో అలంకరిస్తాను. నీకు యోగ్యం చేస్తాను. వాటిని తొడుగుకొని తిరుగు. వట్టి కాళ్ళతో తిరుగబోకు స్వామీ కాళ్ళు కందిపోతాయి. నా యీ విన్నపం ఆలకించు ప్రభూ

"త్వత్ పాద పద్మం మయి సన్నిధత్స్వ"

## 65. నామకవచం

వక్షస్తాడనశంకయా విచలితో వైవస్వతో నిర్జరాః
కోటీరోజ్జ్వల రత్నదీపకలికా నీరాజనం కుర్వతే,
దృష్ట్వా ముక్తివధూ స్తనోతి నిభృతాశ్లేషం భవానీపతే
యచ్చేత స్తవ పాదపద్మభజనం తస్యేహ కిం దుర్లభం

పద్యం

నీ పాదముద్రలు నీభక్తుమైగాంచి
హడలి యముడు పలాయనముజెప్పె
నీయోగి మునుముందు నీ విగ్రహముగాంచి
కామశూరుడు నీరుకారిపోయె
నీ సుపూజాపుష్ప నిర్మాల్యముధరించు
నరుమోముగని బ్రహ్మ కరమువణికె
నీభక్తు తపియింప నిక్కివచ్చిన రవి
భద్రు పేర్విని దౌడపట్టువదరె
శ్రితగుణోచిత దేవతాశీర్షమకుట
రత్నరుచిర నీరాజన రాజమాన
సుందరారుణ చరణారవిందయుగళ
వందనమ్ములు కోట్యభినందనములు !

## వ్యాఖ్య

భవానీపతీ! భక్తవత్సలా! ఈ మధ్య కొన్ని గమ్మత్తులు జరిగాయి చెప్పనా!

యముడు ఒకని ప్రాణాలు తీయటానికి వెళ్ళాడు. అతడి శరీరం మీద నీ పాద ముద్రలున్నాయి. అవి చూచి యముడు బలే భయపడ్డాడు. రాతిలో నుంచియే పొడుచుకు పైకి వచ్చినవాడు వీడి శరీరంనుంచి పుట్టుకురాడా! మళ్ళీ నన్ను తన్ని తరుమడా అనుకున్నాడు కాబోలు ఒకటే పరుగు.

మన్మథుడు ఒక యోగిని భంగపరచటానికి వెళ్ళి ముందు గల నీ మూ చూచాడు. ఈ శివుడు ఎప్పుడు మూడో కన్ను తెరుస్తాడో అని నిలి నిలిచినట్లే నీరుకారిపోయినాడు.

బ్రహ్మ ఒకని మోముపై ఏ చెడువ్రాతలో వ్రాద్దాము అనుకొ వాడి చెవిలో నీ నిర్మాల్యం చూచి మొగలిపూవు మాట జ్ఞప్తికి వచ్చి వణికిపోయాడు.

సూర్యుడు ఒక భక్తుణ్ణి తపించటానికివెళ్ళి వాడు జపించే "భద్రాత్మ! భద్ర శబ్దం విని వీరభద్రుని దౌడ దెబ్బ జ్ఞప్తికి వచ్చి దౌడ చేతితో పట్టి అదే పోక పోయినాడు.

దేవతా రత్న కిరీట నీరాజిత పాదారవిందా! ముక్తికాంతా సమాశ్లేః సౌందర్య దేహా! నీ పాదపద్మారాధకులకు అందరూ వశ్యులే కదా! వారికి దుర్లభాలు ఏమి ఉన్నాయి.

"మృత్యుర్ధావతి పంచమః"

## 66. క్రీడావనం

క్రీడార్థం సృజసి ప్రపంచమఖిలం క్రీడామృగాస్తే జనాః
యత్కర్మాచరితం మయాచభవతః ప్రీత్యైభవత్యేవతత్,
శంభో స్వస్య కుతూహలస్య కరణం మచ్చేష్టితం నిశ్చితం
తస్మా న్మామక రక్షణం పశుపతే కర్తవ్యమేవ త్వయా

### పద్యం

క్రీడార్థమై నీవు క్రీడావనమ్ముగా
సృష్టించుకొన్న దీ శ్రేష్ఠజగతి
సృష్టిలో గల సర్వజీవులు నీ వినో
దార్థమై విహరించు హరిణచయము
ఏమృగం జేమొనరించినా నీకు సం
ప్రీతి కలుగజేయగా తలంపె
జీవకోటి సహస్ర చేష్టా విశేషాలు
నీవేడ్క సాధనానీకమేను

నీ మహత్తర సంకల్ప నిర్ణయాల
ఈవనమ్ములోపల విహరింతు మీశ!
పాపముల బారినుండి కాపాడి నీవె
చూచి రక్షింపవలె మహాసూత్రధారి!

వ్యాఖ్య

శంభో! శంకరా! మహాదేవా! మనలోమాట- నీవు నీక్రీడార్థం ఈ జగత్తును అంతా క్రీడావనంగా సృష్టించుకొన్నావు.

ఈ జగత్తులోని జీవులన్నీ నీ వినోదం కోసం విహరిస్తున్న మృగాలే కదా! ప్రతి మృగం నీకు ఆనందం చేకూర్చటం కోసమే తన విలాసం చూపిస్తుంటుంది. అదే కోరికతో ఇవి అన్నీ నీ చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. వీటి వేషాలు విశేషాలు చేష్టా విలాసాలు అన్నీ నీ వినోదం కోసమే.

నీ సంకల్పానుసారంగా నీ ఇచ్ఛానుసారంగా ఈ జగద్వనంలో జీవులమైన మేము సంచరిస్తున్నాము. మా పాపాలు పారద్రోలి మమ్మల్ని రక్షించే బాధ్యత నీదే స్వామీ! నీవే సూత్రధారివి. నీవే మమ్మల్ని మంచిమార్గంలో నడిపించు స్వామీ!

పాత్రధారులమై కళాక్షేత్ర మందు
అడుగు తడబడకుండ మేమభినయింప
సూత్రధారుండవై పైన జూచుచున్న
ఓ జగన్నాట్యసందర్శకా "జయోస్తు''

—ఉదయశ్రీ

## 67. సంస్మరణానందం

బహువిధ పరితోష బాష్పపూర
స్ఫుట పులకాంకిత చారు భోగభూమిమ్,
చిరపద ఫలకాంక్షి సేవ్యమానాం
పరమ సదాశివ భావనాం ప్రపద్యే

పద్యం

"శంభో మహాదేవ! శశిశేఖరా!" అని
పలుక ఆనందబాష్పాలు దొరలు
"అన్నపూర్ణానాథ! ఆర్తరక్షాదక్ష!"
అన ఒడల్ పారవశ్యమ్ముజెందు
"పార్వతీహృదయేశ! "పరమేశ్వరా!" అన
పొంగిపోయి తనువు పులకలెత్తు
"వందారుమందార! నందివాహన!" అన
వరణీయ మధురభావము స్ఫురించు

నిను స్మరించిన మాత్రాన నిరుపమాన
నిర్మలానందమును పొందు నెమ్మనమ్ము
స్వామి నిన్నుగూర్చిన ప్రశంసా ప్రపూర్ణ
భక్తిరస భవ్య భావనా బలము నిమ్ము-

## వ్యాఖ్య

"శంభో! మహాదేవా! శశిశేఖరా'' అని నోరార నీ నామం పలుకగానే ఆనందబాష్పాలు జాలువారతాయి.

"అన్నపూర్ణానాథ! ఆర్తరక్షాదక్ష!'' అనగానే తనువు పారవశ్యం చెందుతుంది.

"పార్వతీ హృదయేశ! పరమేశ్వరా!" అనగానే శరీరం గగుర్పాటు చెందుతుంది.

"వందారు మందార! నందివాహనా!" అనగానే మనస్సులో మధురాతిమధుర భావాలు స్ఫురిస్తాయి.

నిన్ను తలచగానే ఇలా బహువిధాలుగా ఆనందానుభూతులు కలుగుతాయి స్వామీ!

కనుక కాత్యాయనీ కామినీ మనోహరా! హరా! పరమేశ్వరా! నీ పాద భక్తి రసం నాకు నిరంతరం ప్రసాదించు స్వామీ!

"మురవైరి కథలకు ముదితాశ్రు రోమాంచ
మిళితమై యుండని మేను మొద్దు" —భాగవతం

## 68. భక్తి ధేనువు

అమితముదమృతం ముహు ర్దుహంతీం
విమల భవత్పదగోష్ఠ మావసంతీమ్,
సదయ పశుపతే సుపుణ్యపాకాం
మమ పరిపాలయ భక్తిధేను మేకామ్

పద్యం

ఆనంద మధుర దుగ్ధామృతము మరల
మరల నొసంగు మా మంచి ఆవు
కాలెత్తుటన్నదిగాని కొమ్మింత వి
సరుట నెరుంగని సాధుమూర్తి
నిష్ఠమై నీ పాద గోష్ఠమ్ములోనుండి
పొలుపొందుచున్నది పుణ్యమూర్తి
నా పుణ్యముల పంట నాయింటికరుదెంచి
నన్నుద్ధరించుచున్నది మహేశ!

భవ మహాదేవ నీపాదభక్తి అనెడి
కామధేనుపు ప్రాప్తించెగాని దేవ!
ఎన్నడును వీడకుండ వీక్షింపవయ్య
ఓమహాదేవ! నిను వేడుచుంటి సామి!

## వ్యాఖ్య

మహాదేవా! నీ పాద భక్తి ఒక కామధేనువు సుమా! ఆ కామధేనువు ఎంత మంచిది! ఆనంద క్షీరామృతం ప్రతిపూట తడవ తడవకు అపారంగా ఇస్తూనే ఉంటుంది. కాలెత్తటం కొమ్మువిసరటం ఎరుగనే ఎరుగదు. ఉత్త సాధు మూర్తి మా ఆవు తల్లి!

నిష్ఠగా నీ చరణం అనే శరణంలో, ఆ చావడిలో కట్టివేస్తే అలా ఆనందంగా సంతోషంగా విహరిస్తూ ఉంటుంది.

ఈ ఆవు తల్లి నా పుణ్యాలపంట. నా యింటికి వచ్చి నాకు కావలసినన్ని పాలిచ్చి నన్ను రక్షిస్తూ ఉంటుంది.

స్వామీ! ఈ కామధేనువు నన్ను విడిచి వెళ్ళకుండగా చూడు. నీకు మొక్కుకొంటాను. ఇది లేకపోతే నేను జీవించలేను ప్రాణేశా!

క్షణమైనను నీ పాద పద్మాలపై
భక్తిలేని వాని ముఖం చూడకుందునుగాక! —కులశేఖరులు

## 69. మూర్ఖులతోకాని మాట్లాడవు!

జడతా పశుతా కళంకితా
కుటిలచరత్వం చ నాస్తి మయి దేవ,
అస్తి యది రాజమౌళే
భవదాభరణస్య నాస్మి కిం పాత్రమ్

పద్యం

"జడుడు" కాదని నాకు సామీప్యమీయవు
ఏమని నిన్ను భావింపవలెను
"పశువు" కాదని నీవు పలుకనే పలుకవు
ఏమని నిన్ను నూహింపవలెను
"మచ్చ" లేదని సుంత మాట్లాడనొల్లవు
ఏమని నిన్ను కీర్తింపవలెను
"కుటిలుండు" కాదని కూర్మి చూపింపవు
ఏమని నిన్ను స్మరింపవలెను

అందుకే భక్తజన మసంఖ్యాకమయ్యె
నిన్ను అర్థమ్ము చేసికొనియెద రెవరు
ఒక్క దుర్గుణంబైన లేకుండె నంచు
నన్ను ఇంత వీక్షింపకున్నావ దేవ!

వ్యాఖ్య

దేవా! నీ మనస్తత్వం ఎంత మాత్రం అర్థం కావటంలేదు. మంచి వారికే నీ సామీప్యం అని మేము సాధారణంగా అనుకొంటాము. నిన్ను ప్రత్యక్షంగా చూస్తుంటే మరో విధంగా గోచరిస్తున్నది ప్రభూ!

భక్త సమూహంలోకి వెళ్ళి చూచి "వీడు జడుడు కాడు" అని సమీపానికే రావు. జడులను మాత్రము పిలుచుకుపోతావు- నిన్ను ఏమని భావించాలి!

"వీడు పశువుకాదు" అని పలుకనే పలుకవు. పశువులను పట్టుకుపోతావు- నిన్ను ఏమని ఊహించాలి!

"వీడికి మచ్చలేదు"అని మాట్లాడించవు. కళంకం కలవారినే నెత్తికెక్కించు కొంటావు. నిన్ను ఏమనాలి!

"వీడు కుటిలుడు కాడు" అని ప్రేమనే చిలికించవు- కుటిల ప్రవర్తకులతో కాలం గడుపుతావు- నిన్ను ఏమనుకోవాలి!

రావణుడు జడుడు- నంది పశువు- చంద్రుడు కళంకుడు-వాసుకి వక్రగమనుడు- వీరందరు నీకు పరమ భక్తులు. ఆ గుణాలు నాలో లేవనేకదా నన్ను చేరతీయలేదు. పోనీలే- నీ భక్తగణం అసంఖ్యాకం అయింది అదే సంతోషం-

ప్రభూ! నీ దయ అపారం. ఎంతమంది దీనులను హీనులను ఉద్ధరిస్తున్నావు. అందరికీ హితుడవు, సన్నిహితుడవు, స్నేహితుడవు. సాయిప్రభూ! నమోస్తు!

"పాపయోనయః అపిమాం వ్యపాశ్రిత్య పరాంగతిం
యాంతి కింపునః బ్రాహ్మణాః పుణ్యాః భక్తారాజర్షయః"

—భగవద్గీత

## 70. భక్తప్రియుడు

అరహసి రహసి స్వతంత్రబుద్ధ్యా
పరివసితుం సులభః ప్రసన్నమూర్తిః,
అగణిత ఫలదాయకః ప్రభుర్మే
జగదధికో హృది రాజశేఖరోఽస్తి

పద్యం

ఏకాంతమందు ధ్యానించినా- లేక మ
హా జన సందోహమందునైన
సద్గురుబోధ్యప్య పదుపదేశమునైన
మంత్రాక్షరమునైన మాటనైన
క్షీరాభిషేకాలు శ్రీ పదారాధనల్
ముత్యాలహారాల పూజనైన
సంకీర్తనమునైన సరసకావ్యమునైన
పరవశమ్మున సేయు భజననైన
స్వామి స్వీకరించును ప్రీతి సత్వరమ్ము
ఎంత సులభుడో పర్తి సాయీశ్వరుండు
సర్వ సౌందర్య విమల ప్రసన్నమూర్తి
సకల దేవతా లోకైక చక్రవర్తి!

## వ్యాఖ్య

స్వామీ! నీయంత భక్తసులభుడైన దేవుడు మరొకడు లేడుసుమా! ఇది సత్యం!

నిన్ను ఏకాంతంలో కొలిచినా, జనమధ్యంలో నిలిచి భజించినా కరుణిస్తావు.

సద్గురూపదేశం పొంది మంత్రం జపించినా మాటలతో వేడుకొన్నా దయ తలుస్తావు.

అభిషేకాలు చేసినా ఆరాధనలు గావించినా ఆనందిస్తావు.

సంకీర్తన చేసినా సరసకావ్యాలు వ్రాసినా పరవశిస్తావు.

ప్రార్థించినంత మాత్రాన ప్రత్యక్షమవుతావు. దిక్కెవ్వరా అని దిక్కులు చూస్తుంటే వచ్చి రక్షిస్తావు.

సర్వదేవతా చక్రవర్తివై కూడ దీనులు పిలిచీ పిలవకుండానే వచ్చి ఆదుకుంటావు. ఎంత సులభుడవు ప్రభూ!

అగణిత ఫలదాయకా! అమృతాంశుమౌళీ! అనేక అభివందనాలు.

"ఆపదామపహర్తారం
దాతారం సర్వసంపదాం"

## 71. ధనుస్సు

ఆరూఢ భక్తిగుణకుంచిత భావచాప
యుక్తైః శివస్మరణబాణగణైరమోఘైః,
నిర్జిత్య కిల్బిషరిపూన్ విజయీ సుధీంద్రః
సానంద మావహతి సుస్థిర రాజలక్ష్మీమ్

### పద్యం

జగదీశ! నీపాదయుగ పంకజోత్తమో
త్తమ భక్తి పెను అల్లెత్రాడుకాగ
పరమేశ! నీయందు పరవశించు విమలాం
తఃకరణము మహాధనువుకాగ
పరేశ! మోహముల్ బాధలున్ కవ్వించు
అమితాఘములు శత్రుసమితికాగ
పార్వతీపతి! అతిపావనమ్మైన నీ
నామస్మరణము బాణమ్ము కాగ
పరమశివ! నీ దయామృత బలముచేత
నారి ఎక్కిడి దివ్యబాణాలు వదలి
శత్రువుల జంపి అమృతరాజ్యమ్ము నేలి
అనుపమానంద మాధుర్య మనుభవింతు

వ్యాఖ్య

పరమేశ! పరేశ! పరమకృపానిధీ! సాయీశ్వరా! అంతఃకరణం ఒక ధనుస్సు. నీపాదారవింద భక్తి ధనుస్సుకి అల్లెత్రాడు. నీ నామ స్మరణమే ఒక బాణం!

పాపాలు మద మోహ మాత్సర్యాలు క్రూరమృగాలు శత్రుసమూహాలు. సుధీంద్రుడైనవాడు ఈధనుస్సుపై బాణంతొడిగి శత్రుసంహారం చేసి విజయుడై ఆనంద రాజ్యలక్ష్మిని సుస్థిరంచేసుకొంటాడు.

పరమశివా! అటువంటి ధీబలము నాకు ప్రసాదించు. అది నీకృపాకటాక్షం చేతనే లభ్యమవుతుంది కాని అన్యథా దుర్లభంకదా!

శివస్మరణం అనేబాణం అద్భుతం! దేహంనుంచి పాపాలు పోయి ఆత్మ మోక్షమార్గంలో పయనించి చివరకు లక్ష్యం చేరాలి.

త్వమేవ శరణం గచ్ఛ
సర్వభావేన భారత!
తత్ప్రసాదాత్పరం శాంతి
స్థానం ప్రాప్యసి శాశ్వతమ్

## 72. భక్తినిధి

ధ్యానాంజనేన సమవేక్ష్య తమః ప్రదేశం
భిత్వా మహాబలిభి రీశ్వర నామమంత్రైః,
దివ్యాశ్రితం భుజగభూషణ ముద్వహంతి
యే పాదపద్మ మిహ తే శివ తే కృతార్థాః

పద్యం

విశ్వసౌందర్య మహైశ్వర్య విభవ! నీ
ధ్యానమ్ము నిర్మలాంజనముకాగ
సాంబా! సదాశివా! సాయిమహేశ! నీ
నామాక్షరములు మంత్రములుకాగ
కైలాసగిరివాస! కామాదిసంఘమ్ము
ఘనఘోర దుర్గమ వనముకాగ
మహిత మహాదేవ! మాయ దైవతములు
పరిరక్షసేయు సర్పములుకాగ

పార్వతీపతి పదపద్మ భక్తినిధిని
ఎట్టులైనను కని కనిపెట్టగలను
పరమశివ! నీదయామృత బలముకలుగ
భక్తినిధి పొంది సౌఖ్యము బడయగలను

## వ్యాఖ్య

మహేశ్వరా! మహైశ్వర్యదాతా! నీ పాదభక్తినిధిని కనుగొనాలని నిరంతరం శ్రమిస్తున్నాను శంకరా!

నిధిని కనిపెట్టటానికి అంజనం ధరించాలట - నీ ధ్యానం నిర్మలమైన అంజనం! అది కన్నులకు పెట్టుకొన్నాను. మంత్రోచ్చారణ జరపాలట- నీ నామ తారకమంత్రాలు నిరంతరంగా జపిస్తున్నాను!

ముక్తినిధి తమో దుర్గమవనంలో ఉన్నది. దానిని కామాదిసంఘం కావలా కాస్తున్నది. వాటిని మంత్రించి వశంచేసుకోవాలి. ఇంతేచాలదు. నీ కృపాబలం ఉంటేనేగాని ఆ భక్తినిధి కంటపడదు. అది దక్కిందంటే నా యంత అదృష్టశాలి మరొకడుండడు.

శంకరా! కనికరించు ప్రభూ! నాఆత్మ సమర్పణ గావిస్తాను. ఆ నిధి నీ సన్నిధి. దానిని ప్రసాదించు ప్రభూ!

నిరుపమా పునరావృత్తి నిష్కళంక
ముక్తినిధి కానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గ కోదండ చింత నాంజనములేక
తామరసగర్భునకునైన తాపసేంద్ర! - భాగవతం

## 73. శరణం తవ చరణం

భూదారతా ముదవహ ద్యదపేక్షయా శ్రీ
భూదార ఏవ కి మతః సుమతే లభస్వ,
కేదార మాకలిత ముక్తి మహౌషధీనాం
పాదారవింద భజనం పరమేశ్వరస్య

ప ద్యం

భూదారయును గొప్ప శ్రీదారయును ఆత్మ
కాధార మివికావు అని తలంచి
శంకర శ్రీపాద జలజముల్ దర్శింప
మోదమ్ముతోడ దామోదరుండు
శ్రీవరాహంబయి భూవివరము జొచ్చి
'గనలే' నటన్న సంగతిని తెలిసి
ముక్త్యౌషధమ్ములు పుష్కలంబుగ పండు
కేదార రసఖండ మేది యనుచు
శివుని పాదారవిందాలు జేరినాడు
విష్ణువంతటివాడు ఓవెర్రి మనస!
భక్తసులభుడు పార్వతీ ప్రాణధవుడు
సాయిదేవుని సేవింపవోయి సతము

## వ్యాఖ్య

ఓ సుమతీ! శ్రీమహావిష్ణువు లక్ష్మీపతి, భూదేవీనాథుడు. ధనస్వామి భూస్వామి అయికూడా ఈ స్వామ్యములు ముక్తికి ఆత్మ జ్ఞానానికి ఆధారాలూ దోహదాలూ కావు ఆయన అని తెలిసికొన్నాడు.

ముక్తిపంటకు అమృతాంశుమౌళి పాదకేదారాలను ఆశ్రయించాలనుకొన్నాడు. శివ పాదపద్మ దర్శనంకోసం వరాహమై పాతాళంలోకి వెళ్ళి అంతు తెలియక అహంకారం విడిచిపెట్టి అన్యథా శరణంనాస్తి అని శివచరణ భక్తిని ఉపాసించాడు, ఆత్మలో ఆరాధించాడు, అపవర్గం అందుకొన్నాడు.

విష్ణువంతటివాడు అలా శివపాదం కోరుకొన్నాడు. ఓ వెర్రి మానసమా! అటూ ఇటూ పరుగులుమాని మహేశ్వరుని మంగళ చరణాలు ఆశ్రయించి ఆనందం పొందు. శివచరణమే శరణం సుమా!

"కుర్యాద్విద్యాంస్తథాఽసక్త
శ్చికీర్షు ర్లోక సంగ్రహమ్"

## 74. శ్రీ ప దా లు

ఆశాపాశ క్లేశ దుర్వాసనాది
భేదోద్యుక్తై ర్దివ్యగంధై రమందైః,
ఆశాశాటీకస్య పాదారవిందం
చేతఃపేటీం వాసితాం మే తనోతు

ప ద్య ం

రాజీవసంభవ, రాజీవనాభ! దే
వార్చ్య మహామహిమాన్వితములు
సతతధారా దురాశాపాశ దుష్క్లేశ
పుంజ దుర్వాస నోన్మూలనములు
మందాకినీ స్వర్ణ మంజులోదయ నవ్య
పద్మజ సౌరభోద్భాసితములు
పరమపదోన్నత వరపరా సీమంత
రమణీయ రత్న విరాజితములు

శ్రీ దిగంబర శంకర శ్రీపదాలు
శక్తిసుందర దీప్తి నిత్యము వహించి
మంజు మంజూష మామక మానసమును
శ్రీకరమ్మును శుద్ధము సేయుగాక!

వ్యాఖ్య

కైలాసవాసియైన పరమేశ్వరుని శ్రీ పాదాలు పద్మభవ, పద్మనాభాది దేవతా సమూహంచేత ఆరాధింపబడుతుంటాయి.

శ్రీకంఠుని శ్రీపాదాలు దురాశాక్లేశ పాశాలను త్రెంచివేస్తాయి. అవి పవిత్ర మందాకినీ ముక్తి సౌరభాన్విత సహస్ర కమలాలు. అవి పరాదేవి సర్వమంగళ మంజుల మస్తక సీమంత సిందూర రంజితాలు.

శ్రీ శంకర స్వామి పాదపద్మాలు పరమ పవిత్రాలు, పాపలతా లవిత్రాలు, పర్వతత్త్వ ప్రదాలు. అవి నా మానస మణిమంజూషలో నిరంతరం నిలిచి నన్ను పరిశుద్ధుని చేయుగాక!

"తస్మిన్ ప్రసన్నే క్లేశ సంక్షయః"

## 75. మనోహయం

కళ్యాణినం సరసచిత్రగతిం సవేగం
సర్వేంగితజ్ఞ మనఘం ధ్రువలక్షణాఢ్యమ్,
చేతస్తురంగ మధిరుహ్య చర స్మరారే
నేతః సమస్త జగతాం వృషభాధిరూఢ

పద్యం

గౌరీప్రియా! పెండ్లి కూరేగ గోరిన
ఆటగుఱ్ఱమయి నాట్యమ్ముత్రొక్కు
భక్తుల పాలింప పరువెత్త తలతువా!
ఉర్విపై కాలానకుండ నురుకు
యుద్ధమ్ముసేయగా సిద్ధమ్మునైతివా!
వల్గనమున కడు వడిని జూపు
పర్వతపుత్రితో వాహ్యాళి కందువా
నవ నవోచితరీతి నడచిపోవు

నామనస్తురంగము నీ మనస్సు నెరిగి
స్వామిభక్తితో మిగుల విశ్వాసమున్న
సర్వ శుభలక్షణోపేత జంతువిద్ది
దీనిపై విహరింపుమా దేవదేవ!

వ్యాఖ్య

గౌరీ మనోహరా! శంకరా! నా మనస్సు పంచకల్యాణి. ఇది చాలా తెలివి తేటలుగలది. మంచి శుభలక్షణములుగలది. ఇది నీకు చాలా యోగ్యమైనది. దీనిని అధిరోహించు ప్రభూ!

పెండ్లికి ఊరేగింపుగా వెళ్ళాలని భావిస్తే అది నాట్యభంగిమలు చూపిస్తూ పెండ్లి నడకలు నడుస్తుంది.

భక్తరక్షణార్థం వేగంగా వెళ్ళాలంటే కాలుక్రింద ఆనకుండా మనోవేగంతో పయనిస్తుంది.

రాక్షసులతో యుద్ధానికి సిద్ధమైనావంటే ఎన్ని వల్గనములో చూపిస్తుంది.

పర్వత పుత్రితో వాహ్యాళికి అనుకుంటే నవ నవ భంగిమలతో క్రొంగ్రొత్త నడకల హొయలు ఒలకపోస్తుంది.

ఆ ముసలి యెద్దుకు విశ్రాంతి ఇచ్చి ఈ నా పంచకల్యాణిపై స్వారి చేయి సాయీశ్వరా!

ఇది నా మనోతురంగం. యజమాని మనస్సెరిగి నడుచుకొంటుంది. స్వామి భక్తి మిక్కుటంగాగల దీనిని నీకు కానుకగా సమర్పిస్తాను. స్వీకరించి నా కోరిక చెల్లించు ప్రభూ!

"జగతాం పతయే నమో నమః"

## 76. భక్తిమేఘము

భక్తిర్మహేశ పదపుష్కర మావసంతీ
కాదంబినీవ కురుతే పరితోషవర్షమ్,
సంపూరితో భవతి యస్య మనస్తటాక
స్తజ్జన్మసస్య మఖిలం సఫలం చ నాన్యత్

పద్యం

శ్రీపుట్టపర్తీశ! శ్రీచక్రవర్తీశ!
వరదాయియైన నీవరమభక్తి
నీ పాదగగనాన నీలమేఘమువోలె
సంతతానంద వర్షమ్ము కురియు
ఆనీరు ప్రీతితో మానసమ్మునపట్టి
బ్రతుకుపొలమ్ములో పారగట్టి
పుణ్యసస్యమ్ము సంపూర్తిగా పండింతు
ప్రమథేశ! నీ కృపా రశ్మిచేత

దేవ! ఆనందరసము ప్రాప్తించినంత
జన్మసాఫల్యమంది ప్రశస్తినందు
నీరమంటక మాడినపైరువోలె
భక్తిలేనట్టి జన్మ నిష్ఫలముగాదె!

వ్యాఖ్య

పర్తీశ్వరా! పరమశివా! నీయందలి పరమభక్తి వర్షాంబుదమై నా మానస కేదారం పండిస్తున్నది ప్రభూ!

శ్రీచక్రవర్తీ! నీ పాదాకాశంలో భక్తి నీలమేఘమై ఆనందవర్షం కురిపిస్తున్నది. ఆనీరు నా మానససరోవరం నిండ పట్టిఉంచుతున్నాను.

పంటకాలువల బోదెలు త్రవ్వి ఆనీటిని బ్రతుకుపొలంలోకి ప్రవహింపచేస్తున్నాను. దానిద్వారా పుణ్యసస్యం పండిస్తున్నాను. నీ కృపారశ్మిలో అది నిరంతరం వృద్ధి పొందుతోంది.

ఆనందరసం సంప్రాప్తంకాగానే జన్మ సఫలం అవుతున్నది. నీరులేని పైరువలె భక్తిలేని బ్రతుకు నిష్ఫలము కదా! నాభక్తి వ్యవసాయం ఫలించేలాగా ఈ కృషీవలునిపై కరుణవహించు స్వామీ!

తేషాం సుఖం శాశ్వతం
నేతరేషామ్.

## 77. బుద్ధిపుత్రిక

బుద్ధిః స్థిరా భవితు మీశ్వరపాదపద్మ
సక్తావధూ ర్విరహిణీవ సదాస్మరంతీ,
సద్భావనా స్మరణ దర్శన కీర్తనాది
సమ్మోహితైవ శివమంత్రజపేన వింతే

పద్యం

నాబుద్ధిపుత్రిక నాథునివీడిన
పేదరాలువిధాన పిచ్చిదయ్యె
వివరింపజాలని విరహవేదనతోడ
ఎప్పుడు శివమంత్రమే జపించు
కన్నుమూసిన లేక కన్నుతెరిచినను
పశుపతి నామమే పలవరించు
ఏధ్వని విన్న ప్రాణేశ్వరు కంఠ స్వ
రంబని అరిగి దూరంబుచూచు

తప్పదిక ఆమె నూరవ తప్పు గాచి
ఈవె రక్షింపవలెను సాయీ మహేశ!
ఈవు కాదన్న మాకు దిక్కెవరు నాథ!
నవ్య నవనీతహృదయ! అనాథనాథ!

## వ్యాఖ్య

కరుణాసముద్రుడవైన స్వామీ! అంతర్యామీ! నమామి. నా బుద్ధి అనే పుత్రిక ఉన్మత్తురాలై పోతున్నది. నాధుని విరహవేదనలో తపించిపోతున్నది.

క్షణక్షణం శివమంత్రమే జపిస్తున్నది. కన్నుమూసినా తెరిచినా "పశుపతీ! పశుపతీ!" అని ఒకటే పలవరింతలు. ఏధ్వని వినిపించినా నాథుని అలికిడియే అని పరుగెత్తి చూస్తున్నది.

నీ నామమంత్రం జపిస్తూ, మోహంతో స్థైర్యంకోసం నీపాద ధ్యానం, నీపాద స్మరణం, నీపాదసందర్శనం, నీ పాద సంకీర్తనం, నీ పాదపూజనం గురించే విచారిస్తున్నది. అదిచాలా పొరపాట్లేచేసి ఉండవచ్చు గానీ ఈశ్వరా! ఈ ఒక్క తప్పు గాచి అనాథనాథా! ఆర్తత్రాణపరాయణా! ఆర్ద్రహృదయా! దయామయా! ఈ బుద్ధిపుత్రికను స్వీకరించు.

"తత్ప్రాప్య తదేవావలోకయతి
తదేవ శృణోతి తదేవ భాషయతి
తదేవ చింతయతి - "

## 78. సుపుత్రి

సదుపచారవిధి ష్వనుబోధితాం
సవినయాం సుహృదం సముపాశ్రితామ్,
మమ సముద్ధర బుద్ధి మిమాం ప్రభో
వరగుణే నవోఢ వధూమివ

పద్యం

గురుజన శుశ్రూష కూర్మి సేయుటలోన
క్రమశిక్షణముగల కార్యశీల
సంగీత సాహిత్య సరస కళాశాస్త్రి
విద్యాగుణ వివేక వినయజాల
నిత్య నిర్మలతర నిరుపమ వరణీయ
ముదిత రసానంద హృదయలోల
భవదీయ మహనీయ పాదాంబుజ ద్వయ
శరణాగతిని కోరి వరలు బాల

మామక సుబుద్ధిపుత్రి ఉమాకుమారి
మాద్రి నీకు యోగ్యము రజతాద్రివాస!
కాళ్ళు కడిగి ఇత్తు వర శంకర కుమార!
భర్గ! నాకు కన్యాదాన ఫలము నిమ్ము!

## వ్యాఖ్య

ప్రభూ! పరమేశ్వరా! నామానసపుత్రి సుబుద్ధి, సుమతి, సుభాషిణి. ఈమె వినయ శీల, విద్యావతి, సౌజన్యవతి, సేవాపరాయణ.

నా మానసపుత్రి పెద్దలయెడ చాల భక్తిగలది. వారికి సేవా శుశ్రూషలు శ్రద్ధగా చేస్తుంది. మంచి క్రమశిక్షణలో పెరిగింది. సంగీత సాహిత్యాలు బాగా నేర్చుకొన్నది. ఎప్పుడూ ఆనందంగా సంతోషంగా తృప్తిగా ఉంటుంది. ఎల్లప్పుడు నీ నామస్మరణం చేస్తుంటుంది.

ఉమాకుమారివలె ఈసుకుమారి నీకు తగిన ఇల్లాలు కాదగినది. నీవు వరుడవు. నాపుత్రి వధువు. వరశ్రేష్ఠుడవైన నీవు ఈ వధూమణి పాణిగ్రహణము చేయి. నీకు కాళ్ళు కడిగి కన్యాదానంచేస్తాను. నేను ఉత్తమవరుని కోసం వెతుకుతున్నాను. మా అమ్మాయిని స్వీకరించి నన్ను కృతార్థుణ్ణి చేయవలసింది. నన్ను ఈ విధంగా ఉద్ధరించు ప్రభూ! సాయీశ్వరా!

" యమేవైష వృణుతే తేనలభ్యః "

## 79. పదసౌకుమార్యం

నిత్యం యోగిమనస్సరోజదళసంచారక్షమ స్త్వత్క్రమః
శంభో తేన కథం కఠోరయమరాడ్వక్షః కవాటక్షతిః,
అత్యంతం మృదులం త్వదంఘ్రి యుగళం హా మే మనశ్చింతయ
త్యేతల్లోచనగోచరం కురు విభో హస్తేన సంవాహయే

పద్యం

పవనభక్షణమాత్ర జీవన యోగీంద్ర
    తత్త్వోచ్ఛ్వసన మారుతమ్ములందు
గంగాతరంగ శృంగార వీచీలోల
    తారుణ్య వారిజాతమ్ములందు
సంతత ధ్యాన సంస్మరణాంత కృష్ణ చి
    త్త ప్రపర నవనీతమ్ములందు
బ్రహ్మవాదోదిత పరమ వేదస్వరో
    దాత్త మృదు స్వరితమ్ములందు
సంచరింపజాలిన భవచ్చరణయుగము
జముని కఠినాతికఠిన వక్షఃస్థలమ్ము
తన్నినపు డెంత కందెనో ధర్మమూర్తి
ఒత్తెదను రమ్మ నా మృదు చిత్తమునకు!

## వ్యాఖ్య

సాయీ మనోహరా! నీ పాదపద్మాలు అతిలోక సుకుమారాలు, అవి అతి మృదులాలు, అవి అరవిందాలపైన మందమలయానిలాలపైన విహరించటానికి అలవాటుపడ్డాయి.

నీ పదాలు పవన భక్షణ శీలురైన యోగీంద్ర హృదయపద్మాలపైన సంచారం చేస్తుంటాయి.

నీ చరణాలు గంగాదేవీ మానస తరంగ శృంగార వీచీ విలసిత పారిజాతాలపై విహరిస్తుంటాయి.

నీ యంఘ్రులు కృష్ణ భక్తి రసమగ్న గోపీజన నవ్య నవనీతాలపై అడుగులు వేస్తుంటాయి.

నీ అడుగులు వేదస్వరాలలో ఉదాత్త అనుదాత్త స్వరితాలపై సరిగమలు పలికిస్తుంటాయి.

అంతటి సుకుమార సుందర అరవింద సదృశాలైన నీ పాదాలు యముని వజ్రసన్నిభ వక్షస్థలం తన్నినప్పుడెంత కందిపోయాయో! ఎంతనొప్పి పుట్టాయో!

స్వామీ కాసేపు నా హృదయ పర్యంకంపై కూర్చుంటే కాళ్ళుపట్టి కావడం పెదతాగాని ఇటుదయచేయి సాయీశ్వరా!

"చరణం పవిత్రం వితతం పురాణం
యే పూతస్తరతి దుష్కృతాని"

# 80. గిరిసంచారం

ఏష్యత్యేష జనిం మనోస్య కఠినం తస్మిన్నటానీతి మ
ద్రక్షాయై గిరిసీమ్ని కోమల పదన్యాసః పురాభ్యాసితః,
నోచే ద్దివ్యగృహాంతరేషు సుమనస్తల్పేషు వేద్యాదిషు
ప్రాయస్సత్సు శిలాతలేషు నటనం శంభో కిమర్థం తవ

పద్యం

ఇతగాడు భువిలోన ఏ మారుమూలనో
మునుముందు జన్మించునని తలంచి
అవ్వాని హృదయ మహాగుహాస్థానమ్ము
అశనియంత కఠోరమని తలంచి
శమదమాదులతోడ జపతపమ్ములు చేసి
నను పిల్చుకొనిపోవునని తలంచి
వీడు నా ధ్యానమ్ము వీడిపో డప్పుడే
నడుగకుండగ తప్పదని తలంచి

గిరిశ! గిరివనీభూములు తిరుగుటలును
నేర్చుకొంటివి మరి కాక నీకు కొరత?
మందిరమ్ములు సుకుమార మార్గములును
తీర్చిదిద్దిన యజ్ఞవేదీ స్థలాలు.

## వ్యాఖ్య

శంభో! శంకరా! కృపాసాగరా! ఎంత దయా హృదయుడవు స్వామీ నీవు! ఎంత దూరదృష్టితో భక్త రక్షణ వ్రతం సాగిస్తావు!

నా వంటి కఠినుడు మునుముందు ఎప్పుడో జన్మిస్తాడు. వాడి హృదయం కఠినాతి కఠినం. వాడు శమ దమాదులచే తపస్సు సాగిస్తాడు. తీవ్రంగా ధ్యానం చేస్తాడు.

అప్పుడు నీవు వెళ్ళక తప్పదు. వాడి హృదయ భూమిపై అడుగు మోపక తప్పదు. అది కఠినం కనుక నీ పాదాలు అలవాటు లేక నొచ్చుకొంటాయి, నొప్పి పుట్టి బొబ్బలెత్తుతాయి.

—అని ఆలోచించి నీ కాళ్ళకు అలవాటు కావటంకోసం ఈ కొండల్లో కోనల్లో తిరుగుతున్నావు. గిరివాసం చేస్తున్నావు. కానీ నీకు సుకుమార సుందర సౌధాలు లేకనా, పట్టు పాన్పులు తక్కువయ్యా! మృదులాసనాలు లేకనా స్వామీ! యజ్ఞవేదీ స్థలాలు, పద్మాసనాలు కొదవా నీకు!

మా మీద దయతో ముందునుంచే ఎంత కష్టపడుతున్నావు స్వామీ! నీకు అభినందనాలు.

"నమో గిరిచరాయ
గిరిశాయచ నమః

# 81. దైనికజీవనం

కంచిత్కాల ముమామహేశ భవతఃపాదారవిందార్చనైః
కంచిద్ధ్యాన సమాధిభిశ్చ నతిభిః కంచిత్కథాకర్ణనైః
కంచి త్కంచి దవేక్షణైశ్చ నుతిభిః కంచిద్దశా మీదృశీం
యః ప్రాప్నోతి ముదా త్వదర్పితమనా జీవన్స ముక్తఃఖలు

పద్యం

పార్వతీనాథ! నీ పాదారవిందాల
కూర్మి నర్చించుచు కొంతసేపు
కైలాసవాస! నీ గాథా విలాసాలు
కోరి కీర్తించుచు కొంతసేపు
సత్యసాయీశ! నీ నిత్యసుందరమూర్తి
కొసరి దర్శించుచు కొంతసేపు
వాత్సల్యదీప! నీ వర సమాధిస్థితి
కుదిరి ధ్యానించుచు కొంతసేపు

శివ మహాదేవ! అమృతరాశి స్వభావ!
నిత్య మీరీతి నెనరుతో నిన్ను గూర్చి
మానస ఋషమ్ము కార్యక్రమమ్ములోన
మగ్నమగునట్లు దయజూడుమా! మహేశ!

## వ్యాఖ్య

ప్రభూ! నీ భక్తుడు నీ సేవా కార్యాలలో ఎలా నిమగ్నమై పునీతుడవుతున్నాడో అలా నన్ను నియమించి ధన్యుణ్ణి చేయిస్వామీ!

పార్వతీపతీ! నీ పాదారవిందాలు అర్చిస్తూ కొంతసేపూ- కైలాసవాసా! నీ గాథా విశేషాలు వింటూ మరికొంతసేపూ- సాయీశ్వరా! నీ నిత్య సత్య సందర్శనం చేస్తూ ఇంకకొంత సేపూ- వాత్సల్యమూర్తీ! నీ ధ్యానసమాధిలో వేరొక్కింతసేపూ నీభక్తుడు అనవరతం నిన్ను గూర్చి నిరంతరం ఆలోచిస్తూ ఆరాధిస్తుంటాడు.

నీ భక్తుని మానస ఝషం నిత్యం నీ సంస్మరణ జలంలోనే నిమగ్నమై ఉంటుంది. వాడెంతధన్యుడో కదా! అలాంటి మనస్తత్వం నాకు ప్రసాదించు స్వామీ! నీకు మనస్సు అర్పణ చేసినవాడే కదా ముక్తుడు భక్తుడు.

"ఏష ఆదేశః ఏష ఉపదేశః
ఏషా వేదోపనిషత్ ...."

## 82. విష్ణుసేవలు

బాణత్వం వృషభత్వ మర్థవపుషా భార్యాత్వమార్యాపతే
ఘోణిత్వం సఖితా మృదంగవహతా చేత్యాదిరూపందధౌ,
త్వత్పాదే నయనార్పణం చ కృతవాన్ త్వద్దేహభాగోహరిః
పూజ్యాత్పూజ్యతరఃసఏవ హి నచేత్కోవాతదన్యోఽధికః

పద్యం

పురమర్దనమునకు కరకు బాణంబయి
యానమ్ము సేయ వాహనమునగుచు
ఆహ్లాదమును గూర్ప అర్ధాంగిగానయి
అంఘ్రివెతక వరాహమ్ము నగుచు
అనవరతంబును ఆప్త మిత్రుండయి
తాండవమందు మార్దంగికుడయి
పూజకు నేత్రమ్ము పూవుగా నొసగుచు
దేహ మందర్ధ దేహమ్ము నగుచు

ఎంతగానో పతమ్ము సేవించబట్టి
పుండరీకాక్షు డెంతయో పూజ్యుడయ్యె
శ్రీమహావిష్ణువై విరాజిల్ల సాగె
ధర మహాత్ముల సేవ వ్యర్థమ్ముకాదు.

## వ్యాఖ్య

శివా! శ్రీమహావిష్ణువు అంతటి మహోన్నతస్థితిలో ఉన్నాడంటే అది అంతా నీ సేవా ఫలమేకదా! విష్ణువు నీకు ఎన్ని సేవలు చేశాడు!

త్రిపురాసుర సంహారవేళ కరకు బాణమై నీకు సహకరించాడు. వృషభేంద్రుని రూపంలో నీకు వాహనమై సేవించాడు. నీకు ఆనందం చేకూర్చటానికి ఆర్యా రూపంలో నీ అర్ధాంగంలో భార్యగా ఒప్పారినాడు. నీ పాదమూలం తెలుసుకోవటానికి వరాహమై పాతాళాదిలోకాలు గాలించి అహంకారం విడిచి వినమ్రుడై కొలిచాడు. అన్ని వేళల ఆప్తమిత్రుడై సహకరించాడు.

నీ తాండవ నృత్యకార్యక్రమంలో మృదంగం వాయించాడు. నీకు సహస్ర కమలార్చన చేసేటప్పుడు పూజలో ఒక కమలం తక్కువ వస్తే కంటినే కమలంగా నీ పాదాలపై సమర్పించాడు. ఇలా నీ అనుగ్రహానికి పాత్రుడై దేహంలో సగ భాగంగా నిలిచి సేవించాడు.

మహాత్ముల సేవలు వ్యర్థం కావుకదా! అందుకే ఆయన బ్రహ్మాదు లందరి కంటె పూజ్యతరుడైనాడు. శ్రీమహావిష్ణువైనాడు. ఇందువల్ల బ్రహ్మాదులు పూజ్యులని, విష్ణువు పూజ్యతరుడని, పరమేశ్వరుడు పూజ్యతముడని పరమార్థం.

"త్వామాశ్రితా హ్యాశ్రయతాం ప్రయాతి"

## 83. అమృతుడవు

జననమృతియుతానాం సేవయా దేవతానాం
న భవతి సుఖలేశః సంశయో నాస్తి తత్ర,
అజని మమృతరూపం సాంబ మీశం భజంతే
య ఇహ పరమసౌఖ్యం తేహి ధన్యా లభంతే

పద్యం

మనుజుల ఆయుః ప్రమాణమ్ము పరికింప
శతవర్షములటంచు శ్రుతములయ్యె
పితృదేవుల వయస్సు పెచ్చు యోచింపంగ
మరికొన్ని అధికవత్సరము అకట!
అమరాదివంద్యుల ఆయుఃప్రమాణమా!
వందయే దివ్యసంవత్సరాలు
బ్రహ్మదేవాదుల పరమాయువును గూడ
పరికింప వంద కల్పాలు కాదె

ముందు వెనుకలె ఇందరు పోవువారె
పోవువారి పట్టుక మోసపోవనేల!
అభవు డమృతుండవగుట నిన్నర్చసేయ
పరమ చిరసౌఖ్య సంపదన్ బడయనగును

## వ్యాఖ్య

సాంబా! సాయీశా! సదాశివా! నీవు అమృతుడవు-అజుడవు-ఆది మధ్యాంత రహితుడవు- అమేయుడవు- అపరిమితుడవు- శాశ్వతుడవు-

లోకంలో మనుజుల ఆయువు సుమారుగా శతసంవత్సరాలు. పితృదేవుల ఆయుఃకాలము మరికొన్ని సంవత్సరాలు. దేవతల ఆయువు శత దివ్య సంవత్స రాలు. బ్రహ్మ ఆయువు శతకల్పాలు.

దీనిని బట్టి ఆలోచించగా మనుజులు దేవతలు బ్రహ్మాదులు ముందు వెను కగా అందరూ జనన మరణాలు గలవారే.

సాంబశివా! నీవు ఒక్కడివే స్థిరుడవు, అభవుడవు, అమృతుడవు, మృత్యుం జయుడవు, సదా శివంకరుడవు.

కనుక కష్టాలు కలవారిని సేవించేవారికి సుఖముండదు. నిన్నుకొలిస్తేనే ముక్తి! అశాశ్వతుల్ని అర్చించటం అవివేకం కదా! అమృతానంద పదవి కోరే వాడు అమృతుణ్ణి ఆరాధించాలి కదా!

ఇహపర పరమ సౌఖ్యాలిచ్చే పరమశివుడవు నీవు. నీ పాదములే నాకు పాథేయాలు- పరమ పూజనీయాలు-

"తేషాం సుఖం శాశ్వతం
నేతరేషామ్...."

## 84. ఇల్లరికం

శివ తవ పరిచర్యా సన్నిధానాయ గౌర్యా
భవ మమ గుణధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే,
సకలభువన బంధో సచ్చిదానందసింధో
సదయ హృదయగేహే సర్వదా సంవస త్వమ్

పద్యం

చంద్రశేఖర! పూర్ణచంద్రబింబానన
అస్మదాత్మజను పెండ్లాడుమయ్య
స్వామి! ఇది సుబుద్ధి- సద్గుణంబుల రాశి
కన్యకామణి- అనాఘ్రాతసుమము
ఆత్మజ నెచటికి అంపి యుండగలేను
నాయింట వచ్చి ఉండవలె నీవు
వదలగానేల! పార్వతి కూడ నీ వెంట
తెచ్చుకో మాకేమి దిగులులేదు-

స్వామి! నా ఆత్మజాత సేవా స్వభావ
ఆత్మగృహములోన పరిచర్యల నొనర్చు
సచ్చిదానంద సింధు ! సుస్వాంత బంధు!
సదయ! కల్యాణహృదయ! ప్రశాంతినిలయ!

వ్యాఖ్య

శివా! సకల భువన బంధూ! సచ్చిదానందసింధూ! సాంబమూర్తీ!

నాకు బుద్ధి అనే అమ్మాయి ఉంది. ఆ అమ్మాయి నిస్తాను పెండ్లి చేసుకో- సుఖపడతావు. మా అమ్మాయి అందంలోకానీ ఆటపాటల్లోకానీ అన్ని విధాల చాల మంచిది ఈమె సుబుద్ధి సుగుణాలరాశి. ఈ కన్యామణి అనాఘ్రాత పుష్పం.

అయితే నేను నాబిడ్డను విడిచి ఉండలేను. నా యింటికే నీవు ఇల్లరికం రావాలి. ఇల్లరికం అనగానే నిన్ను తేలికపరుస్తాము అనుకొంటావేమో అదేమీ జరగదు అని హామీఇస్తున్నాను. అందరు మర్యాదగా చూసుకొంటారు కొలుచు కొంటారు. కావాలంటే పార్వతీదేవిని కూడ తెచ్చుకో.

మా అమ్మాయి అందరిలా అసూయపడే రకంకాదు. చాలా బుద్ధిమంతు రాలు. అమృతహృదయ. అమాయిక. మా అమ్మాయి మీ యిద్దరిని పువ్వులతో పూజిస్తుంది. ఇంటిపని అంతా తానే చేసుకొంటుంది. మీకు సేవ చేయటమే భాగ్యంగా భావిస్తుంది.

ఈశ్వరా! ఇంత మంచి పిల్ల నీకు దొరకదు. ఈమె పుట్టింటికి మెట్టినింటికీ కూడ పేరు తెస్తుంది. స్వామీ బుద్ధికన్యను స్వీకరించి మాయింటికి రా! శంకరా!

"ఈశ్వర స్సర్వభూతానాం
హృద్దేశేఽర్జున తిష్ఠతి"

## 85. బీదపూజ

జలధి మథన దక్షో నైవ పాతాళభేదీ
నచ వనమృగయాయాం నైవ లుబ్ధః ప్రవీణః
అశన కుసుమ భూషా వస్త్రముఖ్యాం సపర్యాం
కథయ కథమహం తే కల్పయానీందుమౌళే

### పద్యం

జలనిధిన్ మథియించు సామర్థ్యమున్నచో
దివ్యామృతఫలాలు తెచ్చియిడుదు
పాతాళమును జొచ్చు బలిమియే యున్నచో
భుజగ రత్నాలతో పూజలిడుదు
వేటలో నిరుపమ పాటవంబున్నచో
వ్యాఘ్ర చర్మాంబరద్వయము నిడుదు
ఆకాశమునకేగు అవకాశమున్నచో
శశికళలన్ సమర్చనల నిడుదు

నీకు నైవేద్య మేమి అందీయగలను
ఏమణులతో నిను అలంకరింపగలను
వస్త్రమును కళాకాంతులు పట్టివాను
అక్షతల అన్నిటికిని దేవాధిదేవ!

## వ్యాఖ్య.

స్వామీ! నిన్ను ఎలా పూజించగలను! నీకేమి పరిచర్యలు చేయగలను చెప్పు. నేనా ఏమీలేనివాణ్ణి. నీవా రాజరాజేశ్వరుడవు. అన్నిటికి అక్షతలే సమర్పించుకొంటాను.

స్వామీ! నీకు కల్పవృక్ష ఫలాలు తెచ్చి నైవేద్యం పెట్టాలని ఉంది. కానీ సముద్ర మథనంచేసి కల్పవృక్షాతేలేనే ఎలా!

నిన్ను భుజంగ శిరోమణులతో అలంకరించాలనిఉంది కానీ పాతాళానికి వెళ్ళి సర్పరాజుల్ని పట్టలేనే ఎలా!

నీకు క్రొత్త క్రొత్త వ్యాఘ్రచర్మాంబరాలు కట్టపెట్టాలనిఉంది కానీ అరణ్యాలకు వెళ్ళి వేటాడలేనే ఎలా!

చంద్రకళలు తెచ్చి నీకు అభిషేకాలు చేయాలనిఉంది ఆకాశానికి ఎగిరి చంద్రకళలు తేలేనే ఎలా!

నీకు ఏమి నైవేద్యం పెట్టేది? ఏమి అలంకారాలు చేసేది? ఏమి వస్త్రములు ఇచ్చేది? ఏమి అభిషేకాలు చేసేది ? అన్నీ భావనా మాత్రంగా చేసి అన్నిటికీ అక్షతలే సమర్పిస్తాను. ఇది బీదపూజ స్వీకరించు దయాళూ!

"సద్భావేన హి తుష్యతి
దేవా స్సత్పురుషా ద్విజాః"

## 86. ఎట్లు పూజింతు !

పూజాద్రవ్య సమృద్ధయో విరచితాః పూజాం కథం కుర్మహే
పక్షిత్వం నచవా కిటిత్వమపి నప్రాప్తం మయా దుర్లభం
జానే మస్తక మంఘ్రిపల్లవ ముమాజానే నతేఽహం విభో
న జ్ఞాతం హి పితామహేన హరిణాతత్త్వేన తద్రూపిణా

పద్యం

శ్రీపాదపూజలు సేయుదునన క్రింద
    పాదమ్ములు వెదకి పట్టలేను
శిరముపై పాలభిషేకింతునన పైన
    నీశిరస్థలము కన్పింపదాయె
శ్రీవరాహముగా హరి భవత్ పదసరసి
    జమ్ము దర్శింపగాజాల డనిన
హంసయై ఎగిరి బ్రహ్మయు భవదీయ శీ
    ర్షమ్ము దర్శింపగాజాల డనిన

నేననగ ఎంతవాడ మహానుభావ!
కోటిజన్మాలనుండి చేకూర్చుకొంటి
ఎల్ల పూజాపదార్థాల నేమిసేతు?
ఎట్లు పూజింతు చెప్పవే హే మహేశ!

## వ్యాఖ్య

పరమేశ్వరా! విరాణ్మూర్తీ! ఆదిమధ్యాంతరహితా! పూజాద్రవ్యాలన్నీ విశేషంగా సమకూడినప్పటికీ నిన్ను ఎలా పూజించాలి!

నీ పాదపూజ కావించాలని ఉంది. కానీ ఎలా? పాదం కనిపించదే! హరి యంతటి వాడు వరాహమై కూడ నీ పాదమూలం కనుగొనలేకపోయినాడే! నాకెలా నీ పాద దర్శనం లభ్యమవుతుంది.

అభిషేక ప్రియుడవుకదా! అభిషేకం చేద్దామంటే నీ శిరస్సు కనిపించదే ఎలా! బ్రహ్మదేవుడంతటివాడు పరమహంసయైకూడ ఆకాశమంతా ఎగిరి నీ శీర్ష భాగం దర్శించలేక తెల్లమొగం వేశాడే! నాకెలా సాధ్యం స్వామి!

నీకు పూజాభిషేకాలు చేయాలని కోటిజన్మాలనుంచి కోరుకొంటున్నాను. ఎట్లు అర్చించమంటావో ఉపాయం చెప్పి అనుగ్రహించు స్వామీ!

మానసంలోనే నిత్యం మధుర మహిత భావనా మాత్రం చేతనే నిన్ను ఆరాధిస్తాను ప్రభూ!

"ఆపాతాళ నభస్థలాంత భువన బ్రహ్మాండ
మావిస్ఫుర జ్జ్యోతిః...."

## 87. బూది యిమ్ము !

అశనం గరళం ఫణీ కలాపో
వసనం చర్మ చ వాహనం మహోక్షః,
మమ దాస్యసి కిం కిమస్తి శంభో
తవ పాదాంబుజ భక్తిమేవ దేహి

పద్యం

ఆహార మొక్కింత అర్థింతునా! దేవ!
ఘన కాలకూట భోజనము నీకు
హారమ్ము ఒక్కటి అడుగుదునా! ఈశ!
హాలాహలాహి హారాలు నీకు
పట్టుపుట్టం బొండు పెట్టమందున! శివా!
జంతుచర్మము వస్త్రమ్ము నీకు
ఏవాహనంబైన కావలెనందునా
ఎప్పుడొక్కపె డొక్కుపెద్దు నీకు
ఈవు నాకీయ నీయొద్ద ఏమి గలవు
కొందరా జిల్లరికవు టల్లంత వకట
ఐన నిను వీడి జీవించలేను గాని
నీ యడుగుదమ్మి బూది నందీయవయ్య!

## వ్యాఖ్య

పరమశివా! నీవు ఆది భిక్షువువి. నిన్ను ఆహారం అడుగుదాము అంటే నీవు భోజనం చేసేది కాలకూట విషం.

నీవు ధరించే హారాలలో ఒకటి అర్థించుదాము అంటే అవి అన్నీ విష సర్పాలాయె!

కట్టుబట్ట అడుగుదాము అంటే నీ వస్త్రాలు అన్నీ ఏనుగుతోళ్ళు, పులి చర్మాలు - ఏమి అడిగేది!

వాహనం అడుగుదాము అంటే నీకొక్కటే ముసలి దొక్కు ఎద్దు కదా!

ఇంకేమైనా అడుగుదాము అన్నా కొండమరాజుగారి ఇల్లరికపు టల్లుడవు. నీవు ఏమి ఇస్తావు నేనేమి కోరతాను. కానీ నీ అడుగుతమ్మి బూడిద కాస్త ఇయ్యి చాలు అదే నాకు పదివేలు.

విభూతి సర్వైశ్వర్య ప్రదాయిని అని ధ్వని. అది లభిస్తే అన్నీ లభించి నట్లే - నిందాస్తుతి - శంకరుల వారి కవితలో చమత్కారం ఇది.

కామదః అంటే కామ్యములు ఇచ్చువాడనే కాదు, కామ్యములు ద్యతి ఖండించువాడు అని కూడా అర్థం.

"నన్ను నిష్కామిగా చేయుము"

## 88. యోగ్యతలు లేవు

యదా కృతాంభోనిధి సేతుబంధనః
కరస్థలాధః కృతపర్వతాధిపః,
భవాని తే లంఘిత పద్మసంభవ
స్తదా శివార్చా స్తవ భావనక్షమః

పద్యం

వార్ధిపై రాళ్ళతో వారధి నిర్మించు
ప్రోడయౌ రాజపుత్రుండగాను
అరచేత పర్వత మణచగల్గినయట్టి
మర్మజ్ఞుడైన కర్మందిగాను
సంతత ధ్యాన నిష్ఠాగరిష్ఠత చేత
బ్రహ్మను మించు తపస్విగాను
పరమసుందర భక్తిభావమ్ముతో పతిన్
వర్ణించు దేవసర్పమ్ముగాను

నిన్ను భక్తి పూజింప ధ్యానింప సంత
తమ్ము సేవింప కీర్తింప తగుదునెట్లు
అద్వితీయ! నాకేమి యోగ్యతలు గలవు
ఎట్టులైనను నీవె రక్షింపవలయు!

వ్యాఖ్య

సాయీ ! సాంబమూర్తీ ! నిన్ను అర్చించటానికి కొన్ని అర్హతలుండాలి. అవి నాకేమీ లేవు ఎలా!

నిన్ను ప్రతిష్ఠ చేసి అర్చించటానికి శ్రీరామచంద్రునివలె సేతుబంధనం చేసిన వాణ్ణి కాను—

నిన్ను మదిలో ధ్యానించటానికి అగస్త్యునివలె వింధ్య పర్వతాన్ని అరచేత అణచిన వాణ్ణి కాను—

నిన్ను సమాధి నిష్ఠలో నిల్పి ఉపాసించటానికి బ్రహ్మదేవునంత తపస్విని కాను—

నిన్ను వర్ణించటానికి వేయితలలుగల ఆదిశేషుణ్ణి కాను—

ఏ యోగ్యతలులేని నేను నిన్ను ఎలా కీర్తిస్తాను? ఎలా స్మరిస్తాను? ఎలా పూజిస్తాను?

ఈ అయోగ్యుణ్ణి నీ కృపాజలంతో నీవే దయతలచి పునీతుణ్ణి చేయాలి. నీ కృపకు మించిన యోగ్యత ఏమి ఉంది! దయగలవాడవు, అనాథ నాథుడవు, దీనశరణ్యుడవు, నాకు నీవే దిక్కు !

"యతో వాచో నివర్తంతే
అప్రాప్య మనసా సహ"

## 89. ఏ పూజ ఇష్టము

నతిభి ర్నుతిభి స్త్వమీశపూజా
విధిభి ర్ధ్యానసమాధిభిర్న తుష్టః,
ధనుషా ముసలేన చాశ్మభి ర్వా
వద తే ప్రీతికరం తథా కరోమి

పద్యం

నీ నామకోట్యతినిష్ఠ లిఖించినా
కరుణించి ఒక్కింత కానబడవు
లక్షబిల్వార్చనల్ లక్ష గావించినా
జాలి దలంచి స్పర్శనము నిడవు
వేల కుంభాభిషేకా లొనరించినా
కోర్కె లేమేమియో కోరు మనవు
దమ శమంబులతోడి ధ్యానమ్ముచేసినా
సాక్షాత్కరిం "చింకచాలు'' ననవు

బాణములురువ్వి- రోకళ్ళబాది- కొండ
రాళ్ళతోకొట్ట అపుడు వరాల నిడుదు
నీకు ఏపూజ ఇష్టమో నిక్కమముగ
తెలియపరచిన చేతును దేవదేవ !

## వ్యాఖ్య

ఈశా! మహేశా! నీకు ఏపూజ ఇష్టమో తెలియ చెప్పవు. ఎలా చేస్తే ప్రసన్నత వహిస్తావో నాకు తెలియదాయె !

నీ నామం కోటిసార్లు వ్రాసినా ప్రసన్నం కాలేదు. లక్ష బిల్వార్చనలు లక్ష సార్లు చేసినా జాలి వహించి ప్రత్యక్షం కాలేదు. వేలసార్లు సహస్ర కుంభాభి షేకాలు కావించినా కనికరించి కోరికలు తీరుస్తాను అనవు. శమదమాదులతో తపస్సు చేసినా సాక్షాత్కరించవు. ఎలా స్వామీ! నీ తత్వం తెలియటం లేదు.

ఆ పార్థుడు కొండపై తపస్సు చేసుకొంటుంటే కపట భిల్లుడివై వెళ్ళి పందికై పోరు సాగించావు. ఆ పార్థుడు నీవు అనే సంగతి తెలియక నీ మీద బాణాలు వేశాడు, నీవూ వేశావు, బాణాలు అయిపోయినా కాబోలు రాళ్ళతో కొట్టాడు, రోకళ్ళతో మోదాడు, కలబడి చేతులతో గ్రుద్దాడు, నిన్ను ఎంత బాధించాడు?

స్వామీ! అటువంటి వాడికి నీవు సంతోషంతో అస్త్రాలు, వరాలు ఇచ్చి ఆదరించావు. అది చూచిన తర్వాత నీకు "అటువంటి" పూజ ఇష్టమేమో అని పిస్తోంది. నీకు ఏది ఇష్టమైతే అదే చేయించుకో! ప్రభూ!

"ఆటుకనైన దెలిఖినైన చక్రి చెందగవచ్చు...."

## 90. ఋణవిముక్తి

వచసా చరితం వదామి శంభో
రహ ముద్యోగ విధాసు తేఽప్రసక్తః,
మనసా కృతి మీశ్వరస్య సేవే
శిరసా చైవ సదాశివం నమామి

పద్యం

నీవు నాకొసగిన పావన వాక్కుతో
 నీ నుడుల్ పలికెద నీలకంఠ!
నీవు నాకొసగిన నెనరైన మనసుతో
 నీ ధ్యాన మొనరింతు నిఖిలనాథ!
నీవు నాకొసగిన నిర్మల శిరముతో
 నీకు మ్రొక్కెద మహనీయమూర్తి!
నీవు నాకొసగిన నేత్రద్వయమ్ముతో
 నీ దర్శనము సేతు ఓ దయాళు!

నాకొసంగిన వన్నియు స్వీకరించి
నను ఋణవిముక్తు సేయవే నా ఉపాస్య!
నీ వొసంగినవెల్ల నీ సేవలోకి
అర్పణము సేయు బుద్ధి రవ్వంత నిమ్మ!

## వ్యాఖ్య

దేవా! సదాశివా! నీవు నాకు చాలా చాలా ఇచ్చావు. అవి అన్నీ ఉపయోగించుకొని నిన్ను లెక్కపెట్టకుండ గర్విష్ఠినై విర్రవీగుతున్నాను. అవి దుర్వినియోగం అవుతున్నాయి—

నీవిచ్చిన వాక్కుతో నీ సంకీర్తనం చేస్తాను. నీవిచ్చిన మనస్సుతో నిన్నే ధ్యానిస్తాను. నీవిచ్చిన శిరస్సుతో నీకు నమస్కరిస్తాను. నీవిచ్చిన నేత్రాలతో నిన్ను దర్శిస్తాను. నీవిచ్చిన ఈ ఇంద్రియాలు అన్నీ నీ సేవలో ఉపయోగపడేలా చేస్తాను—

కొంతలో కొంత అయినా ఓ స్వామీ! నీ ఋణం తీర్చుకోవాలని కోరుకొంటున్నాను. కృతఘ్నతాదోషం నన్నంటకుండుగాక!

సర్వ సమర్పణ బుద్ధి రవ్వంత నా కొసంగు సామీ! మహేశ్వరా! నీకు సహస్రాధిక వందనాలు చెల్లిస్తాను.

"త్వయా దత్తం మయా దేవ
తుభ్యమేవ సమర్పితం—"

## 91. శరణాగతి

ఆద్యాఽవిద్యా హృద్గతా నిర్గతాసీ
ద్విద్యా హృద్యా హృద్గతా త్వత్ప్రసాదాత్,
సేవే నిత్యం శ్రీకరం త్వత్పదాబ్జం
భావే ముక్తే ర్భాజనం రాజమౌళే

పద్యం

శరణన్న క్షయరోగి శిరముకెత్తుకొనిన
ఆశ్రితమందార! అంజలింతు
నిత్యమంగళదాయి! సత్యపాయీ! ప్రభూ!
భవదీయ సత్కృపాబలముచేత
జన్మమ్ముతో మానసము గ్రమ్ముకొన్న అ
విద్య అజ్ఞానమ్ము వీడిపోయె
సద్విద్య విజ్ఞాన చంద్రిక మానసం
బంత వ్యాపించె హృద్యమ్ముగాను

శ్రీకరంబైన నీపాదసేవ భృంగి
నీవు నీవనే నీవదు విశ్వనాథ !
ఆత్మసంధాన బ్రహ్మవిద్యా మరంద
బిందువులు గ్రోలి ఆనంద మందుచుందు

## వ్యాఖ్య

శరణాగతత్రాణ బిరుదాంకా! శంకరా! శరణన్నంత మాత్రం చేత క్షయ రోగి అయిన చంద్రుణ్ణి నెత్తికెక్కించుకొన్నావు- శరణాగతులంటే నీకు చాలా ఇష్టం. నేనూ నీకు శరణాగతుణ్ణే శంకరా! దయాకరా! నిత్య మంగళాలు ప్రసాదించు ప్రభూ!

నీ కృపారశ్మిచేత జన్మతః నాలో గూడు కట్టుకొన్న అజ్ఞాన తమస్సు అంతరించిపోయింది ఆనందమూర్తీ!

చిదాకాశమంతా సద్విద్యా విజ్ఞాన చంద్రికలు వ్యాపించినాయి ప్రభూ!

నీ పాద పద్మ సేవను ఈ భృంగి ఇకపీదనే వీడదు చంద్రమౌళీశ్వరా ! నీ పాదపద్మామృతం కడుపార గ్రోలుతూ ఇందే జీవనం సాగిస్తాను. కాదనక అలా కనికరించి కాపాడుతుండు స్వామీ!

"బుద్ధిః జ్ఞాన మసంమోహః"

## 92. ఆనందదాయి

దూరీకృతాని దురితాని దురక్షరాణి
దౌర్భాగ్య దుఃఖ దురహంకృతి దుర్వచాంసి,
సారం త్వదీయచరితం నితరాం పిబంతం
గౌరీశ మామిహ సముద్ధర సత్కటాక్షైః

పద్యం

దుష్టమ్ము దుఃఖమ్ము దుర్మార్గ దురితమ్ము
దౌర్భాగ్య దుర్వాంచ దంభములును
కాఠిన్య దౌర్జన్య బలమౌఢ్య కౌటిల్య
కార్పణ్య కామాది గర్వములును
మద్యమాంసాశన మదవతీ గృహచింతి
తాకృత్య హత్యాది అవినయములు
మద మోహ మాత్సర్య మందబుద్ధి వివేక
రాహిత్య దంభ పరాభవములు

ఆది దుర్లక్షణములు దురక్షరములు
దూరములు సేయు వేదాంతసారమైన
నీ చరిత్రామృతము త్రావి నిలువబడిన
నను కటాక్షించు సాయి! ఆనందదాయి!

## వ్యాఖ్య

గౌరీపతీ! నీ చరిత్రామృతం చాలా మహిమాన్వితం సుమా!

జీవితంలో దుర్వాంఛలు, దుష్టభావాలు, దుర్మార్గాలు, దంభాలు, కార్పణ్యం, కామం, గర్వం, మదం, మద్యపానం, మాంసభక్షణం, మదవతీ వ్యసనం, మందబుద్ధి, కుతర్కం, కుబుద్ధి ఈ మొదలైనవెన్నో నన్ను వెన్నంటి నానా హింసలు పెట్టి అవమానాలు కలుగజేశాయి.

స్వామీ! నీ చరణ సమీపానికి వచ్చి నీ చరిత్ర శ్రవణం చేసిన వేళనుంచి ఆ దుష్ట గుణాలు అన్నీ దూరమైపోయాయి. ఇప్పుడు నేను శాంతిగా వేదాంతిగా ఉన్నాను. నన్ను ఇలా తీర్చిదిద్దింది నీ నామ శ్రవణం దేవా! ఎల్లప్పుడు ఇలా జీవనం పావనం చేసుకొనేలా సదా కటాక్షించు ప్రభూ!

"నామ సంకీర్తనం యస్య
సర్వపాప ప్రణాశనమ్
ప్రణామో దుఃఖ శమనః...."

## 93. శివరూపం

సోమకళాధర మౌళౌ
కోమల ఘనకంధరే మహామహసి,
స్వామిని గిరిజానాథే
మామక హృదయం నిరంతరం రమతామ్

పద్యం

గంగా తరంగాల ముంగురుల్ పైనుండి
జాబిల్లి వెన్నెలల్ చౌకళింప
హరినీలకాంతుల అందాలు విరజిమ్మి
నీలకంఠపు శోభ జాలువార
నేలయు నింగియు నిండారు క్రొంగ్రొత్త
వెలుగురేకలు కనువిందుసేయ
గిరిరాజపుత్రిక చిరునవ్వు మోముతో
ఒయ్యారముగ ప్రక్క నొప్పుమీర
శివశివారూప దివ్య వైచిత్ర్యదీప్తి
మామక మనోజ్ఞ మానస మధుర వీథి
ఎల్లకాలమ్ములందు వ్యాపించి నన్ను
పరవశింపగ జేయుత కరుణ మీర

## వ్యాఖ్య

స్వామీ! సకల లోకాంతర్యామీ! నీ శివ స్వరూపం దర్శనీయం, వందనీయం, అభినందనీయం. నీమూర్తి ఎంత శోభాయమానంగా ఉంది!

తలపై గంగా తరంగాల మిలమిలలు! ఆపై అందాలు చిందే చంద్ర చంద్రికా ధవళిమలు!

ఒకవంక హరినీల కాంతుల కంఠ శోభలు! మరొకవంక గిరిపుత్రి చిరునవ్వు వెలుగులు!

ఇలా అనేక ఒయ్యారాలు ఒలకబోసే నీరూప సౌందర్యం వర్ణనాతీతం! శివా శివాత్మకమై లోకాలకు సమస్త సన్మంగళాలను ప్రసాదిస్తున్న నీ తనూ విభూతి కాంతులు ఆనందానుభూతులను అందిస్తున్నది.

ఈ దివ్య సుందరమైన అతిలోక మనోహరమైన తేజస్సులు నా మానసమంతా నిండి నన్ను ఎల్లకాలాలు పరవశింప సేయుగాక!

"అజాయమానో బహుధా విజాయతే"

## 94. సార్థక్యం

సా రసనా తే నయనే
తావేవ కరౌ స ఏవ కృతకృత్యః,
యాయే యౌ యో భర్గం
వదతీక్షేతే సదార్చతః స్మరతి

పద్యం

పర్తీశ! సాయీశ! పరమేశ! అంచు ఆ
నందమ్ముగా పల్కు నాల్క నాల్క
శుభదాయి వరదాయి సుందర సాయి నిన్
కనుగొను అందాల కనులు కనులు
శరణాగతినికోరి చరణరాజీవాల
శీఘ్రమ్ముగా మ్రొక్కు శిరము శిరము
చిత్తమ్ము చిగురింప సేవావిశేషాలు
గావించు పొన్నారి కరము కరము

గర్వ మదమోహ లోభ దుర్గంధ మింత
అంటకుండగ సర్వలోకాతిశాయి
సాయి వరదాయి మాధురీ సరసభక్తి
ప్రతిఫలించు జీవనము జీవనము సుమతి!

వ్యాఖ్య

"పరమేశ! పరంధామ! పరమశివా! పర్తీశ!" అని పలికే నాల్కయే నాల్క! సాయీశ్వరుణ్ణి దర్శించిన కన్నులే కన్నులు! స్వామి చరణారవిందాలపై మోకరిల్లిన శీర్షమే శీర్షం! సాంబశివుణ్ణి సేవించే హస్తములే హస్తములు!

మద మోహ మాత్సర్య లోభాదులకు అంటకుండా భక్తిని ఉపాసించే దివ్య జీవనమే జీవనం!

లేనిచో జీవనం కేవలం వనమే. బ్రతుకు బండబారినట్లే, అంతా వ్యర్థమే-

భగవాన్! నా సర్వావయవాలు నీ సేవలో ఉపయోగపడి సార్థకం చెందేలా చేయి సాయీశ్వరా!

"కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ"

## 95. ఆహ్వానం

అతిమృదులౌ మమ చరణా
వతికఠినం తే మనో భవానీశ,
ఇతి విచికిత్సాం సంత్యజ
శివ కథ మాసీద్గిరౌ తథావేశః

పద్యం

శ్రీకర! సత్కృపా క్షీరపారావార!
ఆర్యావన లసద్వ్రతైకధుర్య
భక్తరక్షణ కళా పాండిత్య శౌండీర్య!
జ్ఞాన కైవల్య ప్రదాన దక్ష!
బృందారకానంద! వందారు మందార!
ఘోర శైలతట సంచారశీల!
విశ్వసౌందర్య మహైశ్వర్య వైభవ!
పుణ్య చతుర్దశ భువన నాథ!

దేవ! నీ పదాబ్జంబు లతి మృదులాలు
నా మనస్సతి కఠిన మనంగవలదు
అద్రిపై నెట్టులుంటివి? అద్రిరాజు
ఇల్లరికపు టల్లుడవై తి వెట్లు దేవ!

వ్యాఖ్య

భవానీపతీ ! భక్తసులభా ! పరమశివా ! చంద్రశేఖరా !

నా మానసం కఠినం, సారహీనం, పాషాణప్రాయం అని భావించి— నీ పాదపద్మాలు అతికోమలాలు అత్యంత మృదులాలు కదా అని నా మనః పద్మం పైకిరాకుండా ఉండేవు— ఈవంకతో, ఈ వంకకు రాకుండా మానకు ప్రభూ !

నీవు నివసించేది కొండలలోనే కదా! నా మానసం ఆ కొండ రాళ్ళ కంటే కఠినమా స్వామీ!

పోనీ మీ అత్తవారిల్లు సుకుమారంగా మృదువుగా ఉంటుందా అంటే అది కూడ పర్వతమయమే కదా !

నీ పాదాలు కఠిన మార్గయానం సహింపలేనివైతే వారి సంబంధం ఎలా అపేక్షించావు. కనుక ఏవో అడ్డంకులు చెప్పి తప్పించుకోకుండగా నీవు నా హృదయ సీమకు రావలసిందే !

త్రాహిమాం కృపయా దేవ
శరణాగత వత్సలా!

## 96. మనో మాతంగం

ధైర్యాంకుశేన నిభృతం
రభసా దాకృష్య భక్తి శృంఖలయా,
పురహర చరణాలానే
హృదయమదేభం బధాన చిద్యంత్రైః

పద్యం

మానసంబిది శివా! మత్త మాతంగమ్ము
బాటపై నడవదు మాట వినదు
ధైర్యాంకుశమ్ము చే ధరియించి రవ్వంత
అదుపులో బెట్టు ప్రయత్నమయ్యె
బుద్ధినా నొప్పెడు బోనులోపల బెట్టి
బంధింపవలె భక్తి బంధనముల
పరమేశ! నీ పాదపద్మంబు లనునట్టి
స్తంభాల కట్టగా దలచినాను

ఆ శివానంద దాత! నాయత్న మింత
సఫలమొనరింపవే దయా సాంబమూర్తి!
నీ సహాయమ్ము లేకుండ నేను ఏమి
సేయగలవాడ! నా సత్యసాయి దేవ!

## వ్యాఖ్య

గజచర్మధారీ! గజముఖ జనకా! అగజా మనోహరా!

నా మనస్సు ఒక మత్తగజం. ఇది చెప్పినట్లు వినేరకంకాదు. మదమెక్కి ప్రవర్తిస్తున్నది. ఇది మంచి బాటపై నడవదు.

నేను మావటినై ధైర్యం అనే అంకుశం ధరించి దీనిని దారిలో పెట్టటానికి ప్రయత్నిస్తున్నాను. దీనిని బుద్ధి అనే బోనులో పెట్టి భక్తి అనే బంధాలతో బిగిస్తున్నాను. ఆ గొలుసుల్ని నీ పాద స్తంభాలకు బిగించి కట్టివేశాను!

ఈ ప్రయత్నం ఫలించాలి అంటే నాదేమున్నది? ప్రభూ! నీ కృపాకటాక్ష వీక్షణా బలం రవంతకలిగితేనే కాని ఫలించదు. నీ ఆశీర్బలం అనుగ్రహించి మనో మత్త మాతంగాన్ని మంచి మార్గాన నడిపించు నాగభూషణా!

"త్వాం ప్రపద్యే మహేశ్వరమ్"

## 97. పిచ్చెత్తిన ఏనుగు

ప్రచరత్యభితః ప్రగల్భవృత్త్యా
మదవానేష మనఃకరీ గరీయాన్,
పరిగృహ్య నయేన భక్తిరజ్జ్వా
పరమ స్థాణుపదం దృఢంనయాముమ్

పద్యం

మదమెక్కి తిరుగుచున్నది కొమ్ము ఏనుగై
నామనస్సు సదాశివా! మహేశ!
దుష్ప్రవర్తనములతో మహోద్ధృతిజూపు
పట్టపగ్గాలు లేనట్టిదయ్యె
ప్రతిరోజు పెద్ద ఉత్పాతాలు కలిగించు
భవనాలలోనికి పరుగులెత్తు
ఎందరికో ఎన్ని ఇబ్బందులో పెట్టు
తగ ఇంటిపైకి యుద్ధాలుతెచ్చు

దీనితో పడలేకయున్నాను దేవ!
భక్తి శృంఖలాల బిగించి పట్టికట్టి
నీపదాంభోజములయొద్ద నిలుపుచుంటి
వెడలనీయకు దేవ శ్రీ విశ్వనాథ!

## వ్యాఖ్య

స్వామీ! సాయీ మహేశ్వరా! నామనస్సు మదమాతంగమే కాదు పిచ్చి పట్టిన కొమ్ముటేనుగు సుమా!

దీనికి పట్టపగ్గాలు లేకుండా ఉంది. ఇది ఊరిమీద పడి ఉత్పాతాలు సృష్టిస్తున్నది. అకృత్యాలు చేస్తున్నది. అపకారాలు చేస్తున్నది. ప్రాణాలమీదకు తెస్తున్నది.

ఈ మానస మత్తగజం ఇతరుల ఇళ్ళలోనికి దూరిపోతుంది. వారిని ఎన్నో ఇబ్బందులు పెడుతుంది. ఇంటిపైకి తగవులు తెస్తుంది.

దీనితో పడలేకున్నాను- ఎటులో భక్తి శృంఖలాలతో బంధించి తెచ్చి నీ పాదాంభోరుహాల ముందు నిలబెట్టాను. ఇక నీదే భారం. దీనిని వదలకుండ చూడు దైవ చూడామణీ! జ్ఞానద్యుమణీ! సర్వజ్ఞా! సర్వేశా!

"మామేకం శరణం వ్రజ"

## 98. ఇయం మమ సుతా

సర్వాలంకార యుక్తాం సరళపద యుతాం సాధువృత్తాం సువర్ణాం
సద్భిఃసంస్తూయమానాం సరసగుణ యుతాం లక్షితాం లక్షణాఢ్యామ్
ఉద్యద్భూషావిశేషా ముపగత వినయాం ద్యోతమానార్థరేఖాం
కళ్యాణీం దేవ గౌరీప్రియ మమ కవితాకన్యకాం త్వం గృహాణ

పద్యం

సముచితాలంకార సర్వాంగ సుందరి-
రమణీయ సరళ మరాళగమన-
సుబుధ ప్రశంసా సుశోభనకారిణి-
సౌవర్ణ మాధురీ సాధువృత్త-
సరస సలక్షణ సారస గుణవతి-
లక్షితాదర్శ కల్యాణవాణి-
సంగీత సాహిత్య సౌహిత్య సంస్తుత్య
భాషా విభూషణ భూషణాంగి-

వినయ విద్యాలలామ- వివేకధామ-
ఈమె మత్కవితా సుతా హేమగాత్రి-
నీకు రాణి కాతగినది నీలకంఠ!
స్వీకరింపుము స్వామి! పినాకపాణి!

## వ్యాఖ్య

దేవా! గౌరీ మనోహరా! శంకరా! సాయీశ్వరా! శివా! మహానుభావా!

ఈ సుకుమారి నా కవితా కుమారి. ఈమె ఆనంద లహరి. ఇయం మమ సుత! ఈమె సముచితాలంకార యోషిత, సుందర పదారవింద, మందమరాళగమన చంద్రవదన, కమలనయన!

ఈ కవితాకన్య సజ్జనుల చేత మంచి అమ్మాయి అని ఆశీస్సులు పొందింది. ఈమె సుబుద్ధి, సువర్ణ, సులక్షణ. ఈ గుణవతి నీకు ఎంతైనా అనుకూలవతి!

ఈమె వాణి కల్యాణి, ఈమె సంగీత సాహిత్యాలను బాగా అధ్యయనం చేసిన అమ్మాయి, వినయం వివేకం కలిగిన విద్యావతి.

పినాకపాణీ! ఈ నా కవితా వాణి నీకు రాణి కావాలని ఆకాంక్షిస్తున్నది. నీకు తగిన ఈ రమణీమణిని స్వీకరించుప్రభూ!

"సాలంకారాం మమసుతాం
కన్యాం దాస్యామి తే హ్యజ
పాణిగ్రహణ ధర్మేణ
గృహాణ కవితా మిమామ్"

## 99. సాక్షాత్కారం

ఇదం తే యుక్తం వా పరమశివ కారుణ్య జలధే
గతౌ తిర్యగ్రూపం తవ పదశిరో దర్శనధియా,
హరి బ్రహ్మాణౌ తౌ దివి భువి చరంతౌ శ్రమయుతౌ
కథం శంభో స్వామి న్కథయ మమ వేద్యోఽసి పురతః

పద్యం

పరమశివుడ వీవు కరుణాంబునిధి వీవు
సత్యమ్ముగా సత్యసాయి వీవు
ఆద్యంత రహితుండ వమృతమూర్తివి నీవు
పరమప్రకృతి కధిపతివి నీవు
హరి విధాతలును నీ అంఘ్రి శీర్షముచూడ
పందియై పక్షియై భంగపడిరి
వాఙ్మనసాతీత! వరదేవతానేత!
వరదాత! ఆశ్రిత పారిజాత!

ఎట్లు నాకు సాక్షాత్కార మిచ్చితయ్య
హే దయాంబుధీ! సత్యసాయీ మహేశ!
ఎంతటి అదృష్టవంతుడ నేను నేడు
నీ యుదార రూపమ్ము కంటిని నిజమ్ము.

## వ్యాఖ్య

స్వామీ! నీవు నిజంగా పరమశివుడవేనయ్యా! కరుణాజలధివేనయ్యా!

సర్వమంగళ కరుడవు. భక్తజన సులభుడవు. సత్యంగా సత్య సాయీశ్వర నామం సార్ధకపరచినావయ్యా!

నీవు ఆద్యంతములు లేని అమృతమూర్తివి ! విద్యా అవిద్యా మిశ్రిత ప్రకృతికి అధినాథుడవు. నీ నఖముల దర్శించలేక విష్ణువు, నీ శిఖల దర్శించ సాధ్యం కాక బ్రహ్మ తలవంచినారుకదా! పరమేశా!

ప్రభూ! నీవు వాఙ్మానసాతీతుడవు, భక్తి రస ప్రీతుడవు, ఆశ్రితానంద మందారుడవు, మహా మహిమాన్వితుడవు, గొప్ప మనస్సు కలవాడవు!

ఎట్లో నా భాగ్యవశంచేత– కాదు మా పెద్దల పుణ్యం వలననే నాకు సాక్షాత్కరించావు. స్వామీ! నన్ను ధన్యుణ్ణి చేశావు. నిన్ను దర్శించగలిగిన నేనెంత అదృష్టవంతుణ్ణి!

"నమ శ్శివాయచ
శివ తరాయచ...."

## 100. అందుకో శుభచరిత్ర!

స్తోత్రేణాల మహం ప్రవచ్మి నమృషా దేవా విరించాదయః
స్తుత్యానాం గణనాప్రసంగసమయే త్వామగ్రగణ్యం విదుః,
మాహాత్మ్యాగ్రవిచారణ ప్రకరణే ధానాతుషస్తోమవ
ద్ధూతాస్త్వాం విదురుత్తమోత్తమఫలం శంభో భవత్సేవకాః

ప ద్యం

తూర్పారపట్టిన తొలగిపోవును పొల్లు
గట్టి ధాన్యము నిల్చు నట్టె నడుమ
బ్రహ్మాదిదేవతల్ పరిశోధనముచేసి
నిర్ణయించిరి స్తవనీయుగూర్చి
స్తవనీయులౌ పెక్కు దైవతాగ్రమణుల
అగ్రగణ్యుండ వీవంచు అనిరి
సారవత్ మాహాత్మ్య సర్వేశ్వరేశుండ
వీవయ్య సత్యసాయీ! పరేశ!

ధన్యమైనది వాణి నిన్ స్తవముచేసి
సార్థకత జెందె జన్మ నీ స్తవమువలన
వందనములయ్య శ్రీ శివానందలహరి
స్తోత్ర మంజరి అందుకో! శుభచరిత్ర!

## వ్యాఖ్య

**శంభో! శంకరా! సాంబా! సదాశివా! సాయీశ్వరా!**

బ్రహ్మాదిదేవతలు పరిశ్రమించి, పరిశోధనలు చేసిచేసి స్తవనీయులలో నీవే అగ్రగణ్యుడవని తేల్చినారు కదా!

తూర్పారపట్టితే పొల్లు పోయినట్లుగా అల్పదేవత లందరు ఎగిరిపోయారు. గట్టిధాన్యం మిగిలినట్లుగా నీవు ఒక్కడివే మిగిలావు. ఇంకా కొందరు స్తవనీయులున్నా వారిలో అగ్రగణ్యుడవు నీవే అయినావు.

సర్వేశ్వరేశ్వరేశ్వరుడవు నీవు.సత్యసాయీశ్వరా!మహేశ్వరా!పరమేశ్వరా! వాణి నిన్ను స్తవంచేసి ధన్యఅయింది. నిన్ను స్తుతించి నా జన్మ చరితార్థమయింది. ఇకచాలు.

ఈ శివానందలహరిని ఈ కావ్యకుసుమమును అందుకొని అనుగ్రహించు సాయీశా! అందుకో పవిత్రమూర్తీ! ఇది భవత్ పాదార్పితము!

"నమోనమః"

## శివ పంచాక్షరి

నాగేంద్ర హారాయ త్రిలోచనాయ, భస్మాంగరాగాయ మహేశ్వరాయ
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ, తస్మై నకారాయ నమశ్శివాయ!

మందాకినీ సలిల చందన చర్చితాయ, నందీశ్వర ప్రమథనాథ మహేశ్వరా
మందారముఖ్య బహుపుష్ప సుపూజితాయ, తస్మై మకారాయ నమశ్శివాయ

శివాయ గౌరీ వదనారవింద, సూర్యాయ దక్షాధ్వర నాశనాయ
శ్రీనీలకంఠాయ వృషధ్వజాయ, తస్మై శికారాయ నమశ్శివాయ!

వసిష్ఠ కుంభోద్భవ గౌతమాది, మునీంద్ర దేవార్చిత శేఖరాయ
చంద్రార్క వైశ్వానర లోచనాయ, తస్మై వకారాయ నమశ్శివాయ!

యక్షస్వరూపాయ జటాధరాయ, పినాకహస్తాయ సనాతనాయ
సుదివ్య దేహాయ దిగంబరాయ, తస్మై యకారాయ నమశ్శివాయ!

పంచాక్షర మిదం పుణ్యం యఃపఠే చ్ఛివ సన్నిధౌ
శివలోక మవాప్నోతి శివేన సహ మోదతే!

